బొమ్మల

# యోగి వేమన





మలయశ్రీ

నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్ * విజయవాడ-520002

# మా స్వంత ప్రచురణలు

బొమ్మల శ్రీ షిర్డీసాయి జీవితచరిత్ర
" అక్బర్ బీర్‌బల్ వినోదకథలు
" తెనాలి రామకృష్ణుని సంపూర్ణ హాస్యకథలు
" ఆలీబాబా 40 దొంగలు
" అల్లావుద్దీన్ అద్భుతదీపం
" గలివర్ సాహస యాత్రలు
" శ్రీ శ్రీ శ్రీ మర్యాదరామన్న కథలు
" భట్టి విక్రమార్కుని సాహసకథలు 2భాగాలు
" భేతాళకథలు
" మొగల్ సామ్రాజ్య కథాగాయకులు
" ప్రవక్త మహమ్మద్
" పంచతంత్రకథలు
" మదర్ థెరిస్సా
" రవీంద్రనాథఠాగూర్
" యోగి వేమన
" భగత్ సింగ్
" అంబేద్కర్
" యశపాల్ కపూర్
" భగవతీచరణ
" సుభాస్‌చంద్రబోస్
" చంద్రశేఖరఆజాద్
" జయప్రకాష్ నారాయణ్
" సంఘసంస్కర్త రాజారామమోహనరాయ్
" పూజ్యబాపూజీ

బొమ్మల పంచతంత్రం (2 భాగాలు)

" రామాయణం

" భారతం

" భాగవతం

" దశావతారాలు

" శ్రీకృష్ణలీలలు

" పరమానందయ్యశిష్యులు

" శ్రీ వెంకటేశ్వరలీలలు

" శ్రీ అయ్యప్పలీలలు

" శ్రీరామపట్టాభిషేకం

" జై వీర హనుమాన్

" పల్నాటివీరచరిత్ర

" బాలనాగమ్మ

" శ్రీ కాళహస్తిమహాత్మ్యం

" శ్రీశైలక్షేత్ర మహాత్మ్యం

" శ్రీ సింహాచలక్షేత్రము

" శ్రీ యాదగిరి నరసింహస్వామి చరిత్ర

" శ్రీ కాశీ రామేశ్వర మజిలీలకథలు

" కోటప్పకొండ చరిత్ర

" శ్రీ వినాయక విజయము

" శ్రీ భద్రాచల మహాత్మ్యం

" శ్రీ పాండురంగలీలలు

" శ్రీ రాఘవేంద్రలీలలు

" కనకదుర్గ మహాత్మ్యం

" శివలీలలు

# యోగి వేమన

నిక్కమైన మంచి నీలమొకటిచాలు
తళుకు బెళుకు రాలు తట్టెడేల ?
కులమునుద్ధరించు కొడుకొక్కఁడే చాలు ;
విశ్వదాభిరామ వినురవేమ !



ఉప్పు కప్పురంబు ఒక్కపోలికనుండు
చూడ చూడ రుచుల జాడవేరు,
పురుషులందు పుణ్యపురుషులు వేరయా !
విశ్వదాభిరామ వినురవేమ.

అల్పబుద్ధివాని కధికారమిచ్చిన
దొడ్డవారినెల్ల తొలగ గొట్టు,
చెప్పుతినెడి కుక్క చెరకు తీపెరుగునా ?
విశ్వదాభిరామ వినురవేమ.

అల్పుడెప్పుడు పల్కు ఆడంబరముగాను
సజ్జనుండు పల్కు చల్లగాను,
కంచు మ్రోగినట్లు కనకంబు మ్రోగునా?
విశ్వదాభిరామ వినుర వేమ.

## అక్షరలక్షలు

ధారా నగరంలో భోజరాజు ఆస్థానంలో కవులెంతేవాలు సంభావనలు ముట్టేవి.

అస్మార్తులైన పొరుగూరి బ్రాహ్మలు కొందరు నగర సత్రంలో బస చేసి ఏదయినా ఒక శ్లోకం వ్రాసి రాజుగారి దయవల్ల మరునాడు మృష్టాన్న భోజనం చేయాలని సంకల్పించారు.

అందరూ కల్సి నానా తంటాలు పడి అనుష్టుప్ ఛందస్సులో సగం శ్లోకం పూర్తిచేశారు. మిగతా సగం వ్రాయడానికి ప్రయాస పడుతుండగా, అటువైపు వెళ్ళిన కాళిదాసు కవి విషయం విని నవ్వుతూ శ్లోకం పూరించివెళ్ళాడట.

మరుసటి దినం రాజాస్థానంలో ఆ శ్లోకం వినిపిస్తే ప్రభువు ఆ విప్రుల కోర్కె తీర్చాడట. రెండవ సగభాగం రచనకు ముగ్ధుడై అది ఎవరిదా? అని విచారించి కాళిదాసు మహాకవిదని తెల్సి ఆనందంతో అక్షరలక్షలిచ్చి సత్కరించాడట! ఆ శ్లోకమిది-

భోజనం దేహి రాజేంద్ర ఘృత సూప సమన్వితం।
మాహిశంచ శరచ్చంద్ర చంద్రికా ధవళం దధి॥

ఓరాజా! పప్పునెయ్యితో కూడిన భోజనం పెట్టించుము, అని అయ్యగార్ల అరశ్లోక భావం.

శరదృతువు నందలి వెన్నెలవంటి పెరుగు గేదెది కూడా కావాలిసుమా- అని కాళిదాసు రచించిన శ్లోకార్థభావం. ఇందులో పదరమ్యత తప్ప ఏ మహత్తర నీతి కానీ జనప్రయోజనం కానీ ఉందా?

విశ్వశ్రేయఃకావ్యం-అనే సూక్తికి న్యాయమూ చేకూర్చదు.

భోజనం లభించింది బ్రాహ్మణులకు!
సత్కారం లభించింది మహాకవికి!!

## ఇక ఇవి చదవండి

వేరు పురుగు చేరి వృక్షంబు చెరచురా
చీడపురుగు చేరి చెట్టు చెరచు,
కుత్సితుండు చేరి గుణవంతు చెరచురా ॥విశ్వ॥

అని చెడ్డవారివలన కలిగే ప్రమాదాలనూ-

కులములోన ఒకడు గుణవంతు డుండెనా
కులము వెలయు వాని గుణము వలన,
వెలయు వనములోన మలయజంబున్నట్లు ॥

ఇలా మంచివారి ఘనతనూ-

అనగననగ రాగ మతిశయిల్లుచు నుండు
తినగ తినగ వేము తియ్య నుండు
సాధనమున పనులు సమకూరు ధరలోన॥

అభ్యాసం కూసువిద్య అనీ-

వేష భాష లెరిగి కాషాయ వస్త్రాలు
కట్టగానె ముక్తి కలుగ బోదు
తలలు బోడు లైన తలపులు బోడులా?

డాంబిక వేశాల దగాకోరు తనాలనూ-

## ఇక ఇవి చదవండి

వేరు పురుగు చేరి వృక్షంబు చెరచురా
చీడపురుగు చేరి చెట్టు చెరచు,
కుత్సితుండు చేరి గుణవంతు చెరచురా ॥విశ్వ॥

అని చెడ్డవారివలన కలిగే ప్రమాదాలనూ-

కులములోన ఒకడు గుణవంతు డుండెనా
కులము వెలయు వాని గుణము వలన,
వెలయు వనములోన మలయజంబున్నట్లు ॥

ఇలా మంచివారి ఘనతనూ-

అనగననగ రాగ మతిశయిల్లుచు నుండు
తినగ తినగ వేము తియ్య నుండు
సాధనమున పనులు సమకూరు ధరలోన॥

అభ్యాసం కూసువిద్య అనీ-

వేష భాష లెరిగి కాషాయ వస్త్రాలు
కట్టగానె ముక్తి కలుగ బోదు
తలలు బోడులైన తలపులు బోడులా?

డాంబిక వేశాల దగాకోరు తనాలనూ-

సామాన్య జనానికి కావల్సినవి సరళశైలిలో సజీవ భావాలు, సామాన్య పదాల పాదాల పద్యాలు. అలాంటివి వందలు వేలు మహత్తరంగా రచించిన అసలు సిసలయిన అచ్చపు తెలుగుకవి మన వేమనయోగి. ఆయన పండిత కవి కాకున్నా ప్రజాకవి!

## మకుటం వికటం

వేమన మహాకవిని కవి కాదన్న పండిత శ్రేష్ఠులు ఆయన ఆటవెలది పద్యమకుటం 'విశ్వదాభిరామ వినురవేమ'కు ఇంతవరకు సరియైన అర్థం చూపించలేకపోయారు. ఎవరికి తోచిన కల్పన వాళ్ళు చేస్తున్నారు.

విశ్వద అభిరామ వేమ వినర-అని అన్వయం. విశ్వానికి (జ్ఞానం) ఇచ్చు ప్రియమైన వేమా విను, అనే అర్థం ఎక్కువమంది చెప్పారు. 'విశ్వద' దేవదాసి పేరుగా ఊహించి ఆమెకు అభిరాముడయిన వేమన అని అన్వయం చూపింది రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు. కాని వేశ్యను నిరసించి వెళ్ళిన వేమన ఆమె పేరును తన పేరుతో జోడించుకున్నాడనడం సరిగా తోచదు. ఏది ఏమైనా జనం మెచ్చింది కవిత్వం. చదివిన వెంటనే మరచిపోకుండా జనం జ్ఞాపకముంచుకోగల, తిరిగి తిరిగి పఠించగల మంచి రచనలు చేసేవాడే కవి.

## వేమన రసవత్కవి

అలాంటి యోగివేమన మహాకవి కవితల గొప్పతనాన్ని మొట్టమొదట గుర్తించి వ్యాప్తికి తెచ్చినది ఆంగ్ల అధికారి సి.పి. బ్రౌను. తర్వాత పట్టం కట్టింది

సి.ఆర్. రెడ్డి. ఆ తర్వాత ఎందరెందరో గుర్తించారు ప్రస్తుతించారు. ఈనాడు పండితుల్లో పామరుల్లో వేమన కవి పద్యాలకు విశేష ప్రచారం జరుగుతున్నది. ఆ కవికి చక్కని గుర్తింపు గౌరవం కలిగాయి. వేమన పద్యాలు నాలుగైదైనా రాని తెలుగు చదువరి వుండడు.

# ఎవరీ వేమన ?

ఇంతటి మహాకవి జీవితం గురించి ఊహాలే తప్ప నిజమేమిటో మనకు తెలియదు. కారణం? వేమన ఏ రాజాశ్రయాన్నీ కోరకపోవడం-తనను గూర్చి తన పద్యాల్లో అంతగా ఏమీ చెప్పుకోకపోవటం.

అజంతా చిత్రకారులుకానీ, ఎల్లోరా శిల్పులుకానీ తాము రూపొందించిన అపూర్వకళాఖండాల క్రింద తమ పేర్లు వ్రాసుకోలేకపోయారు. కావాలనుకుంటే వ్రాయక పోదురా. నాటివారికి కళాప్రతిభను చాటాలని లోకోపకారం కలిగించాలనే కాని తమ పేర్లు నిలిచివుండాలనే తపన స్వార్థం లేకుండేవి. వేమన కవిదీ అదే ధోరణి.

అయితే జనవ్యాప్తిలో ఉన్న విషయాలను బట్టి వారి కథ కొంత తెలియవస్తున్నది. పద్యాలబట్టి కొంత ఊహింపబడుతున్నది.

జనం వ్యాప్తిని నమ్మదామంటే-ఒకేకాలపువారు కాని శ్రీనాథ-పోతన కవులకు బంధుత్వం అంటకట్టలేదా? అక్బర్ చక్రవర్తి కాలపు కబీరుదాసుతో ఔరంగజేబు-తానీషా కాలంనాటి రామదాసుకు లంకె వేయలేదా?

ఏది సత్యం!

పద్యాలలోని భావాలబట్టి కథను ఊహించుదామంటే, కవి అన్నీ తాను అనుభవించిన భావాలనే వ్రాయడం జరుగుతుందా? ఇతరులవలన తెలిసినవి తాను లోకంలో చూసినవీ వ్రాస్తాడుకదా! ఏది దారి?

వేమన పద్యాలపై సాగినంత పరిశ్రమ ఆయన జీవితచరిత్రపై సాగలేదు. కాలం గడిచిన కొద్ది సత్య కథ మరుగున పడిపోతుంది-(పోయింది) కల్పనలు వ్యాప్తికొస్తాయి.

ఆయనపై నవలలు నాటకాలూ తక్కువే వచ్చినై. పంచనాదంగారి నాటకం ఒక్కటే అధిక వ్యాప్తి, అది చిత్తూరు నాగయ్యగారు నటించిన యోగి వేమన సినిమా కంటే పూర్వపుది. ఈ మధ్య విజయచందర్ నటించిన సినిమా దానికి అనుకరణ అని ఆ చిత్ర దర్శకుడు సి.ఎస్.రావు అన్నారు. ఈ చిత్రం దెబ్బతిన్నది.

అవి ఆకాలపు రచయితల భావాలను ప్రదర్శించేవిగా వున్నవే తప్ప కవి జీవితానికి-స్వభావానికీ న్యాయం చేకూర్చేవిగా లేవు.

నార్లవారి 'వేమన' ఆంగ్ల పుస్తకంలో ప్రజావ్యాప్తిలో వున్న కథను తప్పని పద్యాలబట్టే కథను ఊహించారు. వేమన కవితపై పరిశోధన సల్పిన డా॥ఎన్. గోపి, నార్లవారి బాటనే అనుసరించారు.

నాకు ఆ దారి సమ్మతం కాలేదు.

నేను 1984లో రచించిన 'ప్రజాకవి యోగివేమన' నాటకం కవి జీవి

తానికి ఎంత సన్నిహితమో తెలియదుకొని వారి స్వభావాన్ని, ధ్యేయాన్ని మాత్రం చక్కగా చాటింది. పన్నెండుసార్లు రసవత్తరంగా ప్రదర్శనలిచ్చాం.

కరీంనగర్ 'కళాభారతి'లో జూ॥ లెక్చరర్స్ రాష్ట్ర సదస్సులో ఈ నాటకాన్ని ప్రదర్శించినప్పుడు గుంటూరు ఉపన్యాసకులు వచ్చి ప్రశంసించడం అపూర్వ గౌరవంగా భావించాను. వారిది వేమన సంచరించిన ప్రాంతం అని ఆనందించాను. మా నాటకం రచన దర్శకత్వంతోపాటు వేమన పాత్ర పోషణ నాది (మలయశ్రీ). సంగీతానికి, నటనకు, ఇతర పాత్రలకు సరియైన సహకారం అందించిన మా మిత్రులు అభినందనీయులు.

ఇప్పుడు నవరత్నావారి కోరికగా ఈ ఆంధ్ర కవిరత్నం జీవితాన్ని 'యోగివేమన' మీ ముందుంచుతున్నాను. ప్రజలవ్యాప్తిలో వున్న కథల పద్యాల ఆధారంగానే ఆ మహాకవి జీవితాన్ని-కవిత్వ సారాన్ని మితంగానయినా 'కొండ అద్దమందు కొంచెమై యుండదా' అన్నట్లు చూపుతున్నాను.

ఆణిముత్యాల్లాంటి పద్యాలను కొన్ని చివరగా ఇచ్చాను.

ఈ చరిత్ర పురుషుని జీవితచరిత్ర ఊహించవలసిరావటం విచిత్రం. నా రచన పోతన మహాకవి నుడివినట్లుగానే సాగింది.

"విబుధ వరుల వలన విన్నంత కన్నంత
తెలియ వచ్చినంత తేటపరతు"

సరసులు సంతోషింతురు గాక; సత్య సంశోధకులు ఇంకా మధించి నిజమయిన చరిత్రను వెలయింతురుగాక-

వేమన మహాకవి,

కామిగా విహరించిన, కడగండ్లు గడచిన

కవిగా సంచరించిన, కటు సత్యాలు గానంచేసిన

"కొండవీడు"కు వెళదాం పదండి!

## కొండవీడు...

గుంటూరు మండలంలో కొండవీడు ప్రఖ్యాత గిరిదుర్గం. అది రెడ్డి రాజుల ప్రాభవానికి కంచుకోట-విజయపతాక!

అక్కడి కొండరాళ్ళకు తెల్సు నాటి తెలుగువీరుల గుండె లెంతటి దృఢమైనవో. అక్కడి పిల్లవాయువులకు తెల్సు నాటి సాహితీ పరిమళాలెంతటి ప్రతిభావంతమైనవో. అభిమాన ధనానికి కదనవీరానికి వీడు కొండవీడు.

శాతవాహనులు, చాళుక్యులు, కాకతీయుల తర్వాత ప్రభవించిన తెలుగు రాజన్యులు రెడ్డిరాజులు-పద్మనాయక వెలమ ప్రభువులు. వీరి తర్వాత వెలసింది హంపీ విజయనగర ఆంధ్రసామ్రాజ్యం.

కొండవీటి రెడ్లకు పూర్వీకుడు కోమటి వేమారెడ్డి ఒంగోలు జిల్లాలోని అద్దంకి పరిపాలకుడు. ఆ వంశములోని మల్లారెడ్డి కవిత్రయంలోని ఒకడయిన ఎర్రనకు ఆశ్రయమిచ్చాడు. ఆయన ప్రబంధ పరమేశ్వరుడని ఖ్యాతిపొందిన కవి. కొమరగిరి వేమారెడ్డి తర్వాత (ఆయనే కర్పూర వసంతరాయలు) కొండవీడు ఈ వంశంవారికి దక్కలేదు. కాపు కులస్థుడైన చందవోలు వేమారెడ్డి ప్రభువైనాడు.

ఆయన కొడుకు రాచవేమన తర్వాత ఈ రాజ్యం రాజమండ్రి రెడ్లపాలయినది. కొమరగిరి తర్వాత వేమారెడ్డి ఆస్థానంలో వాసి గాంచినవాడు శ్రీనాథకవి సార్వ భౌముడు.

మన కవి వేమన అన్న పై రాచవేమనా? అయితే శ్రీనాధునికి సమ కాలికుడు. కాని చారిత్రకులెవ్వరూ ఆ విషయం పేర్కొనలేదు. ఆధారాలూ లభించ లేదు. కొండవీడు రాజ్య పతనానంతరం రాజమండ్రి రెడ్డిప్రభువుల పాలనలో, కవి వేమన అన్న రాచవేమన ఉండవచ్చును. రాజబంధువు కానోపును.

## వేమన బాల్యం

వేమన పుట్టింది కర్నూలులోని మూగచింతలపల్లి. బాల్యంలోనే తల్లీ దండ్రీ గతించారు. అన్న రాచవేమన, వదిన నరసమాంబ గారాబంగా పెంచారు కొండవీటిలో.

వారికి ఒక కూతురు. జ్యోతి వ్యవహార నామం. పుత్ర సంతానం లేదు. పుత్రునిలాంటి మరది వుండగా వేరే పుత్రులెందుకని ఆయమ్మ తృప్తిపడింది. మరది వేమన్నను కన్నకొడుకుగానే చూసింది. ఇంకా అంతకు మిన్నగా అన్నా తప్పులేదు. పెంచిన ప్రేమ కన్నప్రేమకంటే యెక్కువకదా!

రాచ వేమన్నకు రాచ కార్యాలెక్కువ. గ్రామాధికారి. ప్రజా వ్యవ హారాలను చూసే సందడిలో తమ్ముని సంగతిని పట్టించుకునే తీరికెక్కడిది- తక్కువ.



విద్యాగురువుల నేర్పరిచాడు. నాటి చదువులు వేరు. ఆశ్రమాలు-మఠాలు ఆలయాలు, అయ్యవార్ల ఇళ్ళల్లోనే విద్యాబోధన. వేరే పాఠశాలలు లేవు. ధనవంతుల ఇండ్లకు వెళ్ళి అధ్యాపకులు పిల్లలకు చదువు చెప్పేవారు.

అక్షర పరిచయం గుణింతం అయింతర్వాత శతకాలు, కొన్ని పురాణాల భారత భాగవతాల ఘట్టాలు చదివితే సామాన్యుల చదువు అయిపోయినట్లే. పండితులు కావాలంటే కావ్యాలు, నాటకాలు చదివేవారు. వైదిక చదువులు వేరు ఉపనిషత్తులు దర్శనాలు వేదాలు.

వేమన సంస్కృతం చదవలేదనుకోవచ్చు, తెలుగులో కావ్యాలు చక్కగానే చదివాడు. అవసరానికి తగిన లెక్కలు నేర్చాడనుకోవచ్చు.

నాడు వ్యక్తి ప్రతిభను అనుభవాన్నిబట్టి గుర్తింపు రాజోద్యోగాలు లభించేవి, అవే ధన సంపాదనకు జన సన్మానాలకు కారణమయ్యేవి.

సర్టిఫికేట్ల డిగ్రీల చదువులుకావు, ఉద్యోగాల కోసంకాదు. బలవంతపెట్టి చదివించేవారు లేరు. కాబట్టి ఆయన చదువు నిలిచిపోయింది.

అందుకు మరోకారణం వయసు. యౌవనారంభంలో మనసు నిలకడ తక్కువ-కోరికలెక్కువ, గుర్రాలవలె పంచేంద్రియాలు పరుగులు పెట్టేదశ, దానికి దుడుకు మిత్రులు తోడ్పడుతారు అగ్నికి వాయువువలె, పెద్దల అదలింపో బుద్ధి అదుపో లేకపోతే ఆ పడుచుజీవితం తెగిన గాలిపటం.

పాడిపంటలకు కొదవలేని కాలం, పుష్టిగా ఏపుగా పెరిగాడు వేమన. ఆటపాటల్లో ఉత్సాహం కలవాడు కనుక ఆరోగ్యంగానూ దృఢంగానూ ఉండేవాడు.

## మత సాంఘిక పరిస్థితులు

శాతవాహనుల కాలంలో ఆంధ్రదేశంలో బౌద్ధం-వైదికం వ్యాప్తి చెందాయి. వైదికం యజ్ఞయాగాదులంటే విలువిచ్చే ధర్మం, బౌద్ధం శాంత్యహింసలకు సత్ప్రవర్తనకు పట్టంకట్టింది. గుంటూరు మండలంలోని 'అమరావతి' స్తూపం క్రీస్తు కాలానికి పూర్వపుది అని తెలిస్తే ఆశ్చర్యపోతాం, బౌద్ధం-జైనం ఆంధ్రదేశంలో బాగానే వ్యాపించాయి.

మహాయానశాఖ బౌద్ధ ప్రవక్త నాగార్జునుడు నివసించిన నందికొండ గుంటూరు-నల్గొండ మధ్యలోదే, అదే ఇప్పటి నాగార్జునసాగరం-విజయపురి. జైన పంపకవి కన్నడ భారతం (నన్నయకు పూర్వం) వ్రాసింది కరీంనగర్ జిల్లాలోని వేములవాడలో. రాజమహేంద్రంలోనే తొలి తెలుగు కావ్యంగా వైదిక పురాణ హిందూ మతోద్ధరణకోసం 'మహాభారత రచన' కావించాడు నన్నయభట్టు.

ఓరుగల్లు కాకతి ప్రభువులు మొదట జైనులే. పిదప శైవులయ్యారు. శివకవి పాల్కురికి సోమనాథుడు ఆ కాలపువాడే. స్వయంభూ దేవాలయం వేయి స్తంభాలగుడి వారి శివభక్తికి తార్కాణాలు, వైష్ణవంకూడా వ్యాప్తిలో ఉందనడానికి కాకతీయ సేనాని గోనబుద్ధారెడ్డి రచించిన రంగనాథ రామాయణం సాక్షి. భాస్కర రామాయణంకూడా ఆ కాలపుదే. నెల్లూరి తిక్కన సోమయాజి శైవ వైష్ణవుల తగాదాలను దూరం చేయడానికి హరిహరనాథుని సృష్టించాడు.

ఇంత చెప్పింది కొండవీటిరెడ్డి ప్రభువుల రాజరిక కాలంలో జైన బౌద్ధాలు వెనుకకుపట్టి శైవవైష్ణవ పురాణ మతాలు వ్యాప్తిలో ఉన్నాయి అని తెలపడానికే.

రెడ్డిరాజులు శైవులు, పద్మనాయక వెలమలు వైష్ణవులు. పలనాటియుద్ధ కారకుడైన బ్రహ్మనాయకుడు వెలమవీరుడు-చెన్నకేశవ భక్తుడు, నాయకురాలు రెడ్డి నాగమ్మ శివభక్తురాలు, అదొకరీతిగా మత పోరాటమే.

ఇక కొండవీటి రెడ్డిరాజులు శైవులనడానికి ప్రబల నిదర్శనం వారు పోషించిన ఇద్దరు ప్రముఖ కవులు ఎర్రన శంభుదాసు, శ్రీనాథకవి సార్వభౌముడు శివభక్తులు!

దేవాలయాల్లో అంగరంగ వైభోగాలు రాజాదరణతో ఘనంగా, ప్రజాదరణతో మితంగానైనా జరిగేవి. అప్పటికి ఇస్లామీ క్రైస్తవ మతాల వ్యాప్తిలేదు.

పూజారులతోపాటు బాజాలవాళ్ళు, పూలు ఇచ్చేవాళ్ళు, పరిచారకులు, నాట్యకత్తెలు...దేవాలయాలకు నియమింపబడి ఉండేవారు. ఈ వాతావరణంలో పెరిగాడు వేమన.

## దేవదాసితో పరిచయం

దేవాలయాలలో నృత్యం చేసేవారిని దేవదాసీలంటారు. వారు పెళ్ళిళ్లు చేసుకోరు. అలా శాసించింది సమాజం స్వార్థంతో. ఆటపాటల్తో స్వామిని సేవించేవారు-ప్రేక్షకులను అలరించేవారు. అదొక పుణ్యకార్యంగా భావిస్తూ గౌరవంగానే జీవించేవారు. ఈ నాట్యకత్తెలనే కళావతులు, వేశ్యలు అనేవారు.

సినిమాలు, ఆధునిక నాటకాలులేని ఆ కాలాల్లో వీధిభాగోతాలు, గొల్లసుద్దులు, బొమ్మలాటలు, గారడీలు, భోగం మేళాలు...ఇవే ప్రజలకు కాలక్షేప సాధనాలు.

ఒకానొక పర్వదినాన కొండవీటి దేవాలయంలో దేవదాసి నృత్యం చూశాడు వేమన. ప్రేక్షకుల కళ్ళన్నీ ఆ యువనర్తకిపైన, ఆమె కళ్ళేమో దైవ విగ్రహం పైన.

కోడె వయసులో బుసలుకొట్టే కోరికలతో ఉన్న వేమన్న మనస్సును దేవదాసి సౌందర్యం ఆకర్షించింది. ఆమెకూడ అతనిపైచూపు నిలిపింది. పలకరించాడు. మాటకలిపింది, వలపు కలసింది, స్నేహం పెరిగింది.



దేవదాసి భవనంలోనే వేమన నివాసం. ఆయనకు అన్నగారి గృహం తప్ప సొంత భవనమేదీ లేదుకాని, ఉంటేనా? తన ప్రేయసిని పూల పల్లకిపై ఎక్కించి తీసుకెళ్ళేవాడే! అంతటి ప్రేమ ఏర్పడింది.

ప్రేమ గుడ్డిదంటారు—అదెంతవరకు నిజమోకాని, అది యువతీ యువకులను గుడ్డివాళ్ళనుమాత్రం చేస్తుంది.

పిల్లి కళ్ళుమూసుకొని పాలుత్రాగితే మాత్రం లోకం కళ్ళను ఎన్నాళ్ళు

మూయగలుగుతుంది? వేమన-దేవదాసి స్నేహంసంగతి ఊరంతా వ్యాపించింది. జన
ముచ్చట్లుగా చెప్పుకోసాగారు.



మొదట దొంగగా వెళ్ళివస్తుండేవాడు. ఇప్పుడు దొరగా వెళుతున్నాడు
ఆమె నాట్యంచేస్తుంది. అతడు తాళంవేస్తాడు, భళా! అని మెచ్చుకుంటాడు. గ
టలు రోజులు ఆమె సన్నిధిలో ఆయనకు క్షణాలుగా గడిచిపోతున్నాయ్. ఈడ
జోడు అందం చందం అన్నింటా సరిపడి ఆ జంట చూడముచ్చటగా ఉన్నారు. వా
ఇద్దరం తగులంగట్టిన బ్రహ్మనేర్పరికదా, అన్నట్లుంది చూసేవాళ్ళకు.





దేవదాసి తల్లికిమాత్రం బెంగపట్టుకుంది, ఆమెకు డబ్బు పిచ్చి జాస్తి. ఏ ఒక్కరిపైనా వెలయాలి ప్రేమ నికరంగా ఉండకూడదని ఆమె తలంపు. అసలు తమవంటి స్త్రీలకు మగవారిపై ప్రేమే ఉండకూడదు. కాని, ఉన్నట్లుగా నటిస్తూ వారినుండి కుప్పలు కుప్పలుగా ధనందోచి ఆ తర్వాత ఒకరివెనుక ఒకరిని వీధుల్లోకి నెట్టివేయాలనే సిద్ధాంతం ఆమెది.

తల్లి, దేవదాసికి నచ్చచెప్పింది, వేమారెడ్డి బుద్ధిమంతుడే కాని వదిన చాటు పిల్లడు డబ్బు దస్కం ఇవ్వలేడని, కూతురుకు కోపంవచ్చింది.

"డబ్బుతప్ప మరో ధ్యాసలేదా అమ్మా నీకు? ప్రేమించే పురుషుడు లభించడం స్త్రీకి వరం, అటువంటి సజ్జనుని నీడలో జీవించడం భాగ్యం, మరణించినా జన్మధన్యం!" అంది. ముక్కుపై వేలేసుకుంది జనని.

"ఈ ప్రేమలు అన్నంపెట్టవే వెర్రితల్లీ" మాత్ర హితోపదేశం.

"నీ వంకర నడకలు నాకుచెప్పకు." కసురుకుంది కూతురు.

"ఆ నడకలతోనేనే నేను నీకీ హంస నడకలు నేర్పింది. అవి చూసే ఆ రెడ్డబ్బాయి మోజుపడి నీ కాళ్ళకడ పడివుంది."

"ఆయన కాదే—నేనే ఆయన కాళ్ళకడ పడి ఉన్న."

"ఏమిటేమిటీ?"

"సమాజంలో మనకెంత గౌరవముందో తెల్సా తల్లీ నీకు?"

"మనకేమయిందని-దేవదాసీలం!"

"దాసీలం."

దేవదాసి తల్లికి మాత్రం బెంగపట్టుకుంది, ఆమెకు డబ్బు పిచ్చి జాస్తి. ఏ ఒక్కరిపైనా వెలయాలి ప్రేమ నికరంగా ఉండకూడదని ఆమె తలంపు. అసలు తమవంటి స్త్రీలకు మగవారిపై ప్రేమే ఉండకూడదు. కాని, ఉన్నట్లుగా నటిస్తూ వారినుండి కుప్పలు కుప్పలుగా ధనందోచి ఆ తర్వాత ఒకరివెనుక ఒకరిని వీధుల్లోకి నెట్టివేయాలనే సిద్ధాంతం ఆమెది.

తల్లి, దేవదాసికి నచ్చచెప్పింది, వేమారెడ్డి బుద్ధిమంతుడే కాని వదిన చాటు పిల్లడు డబ్బు దస్కం ఇవ్వలేడని, కూతురుకు కోపంవచ్చింది.

"డబ్బుతప్ప మరో ధ్యాసలేదా అమ్మా నీకు? ప్రేమించే పురుషుడు లభించడం స్త్రీకి వరం! అటువంటి సజ్జనుని నీడలో జీవించడం భాగ్యం, మరణించినా జన్మధన్యం!" అంది. ముక్కుపై వేలేసుకుంది జనని.

"ఈ ప్రేమలు అన్నంపెట్టవే వెర్రితల్లీ" మాతృ హితోపదేశం.

"నీ వంకర నడకలు నాకుచెప్పకు." కసురుకుంది కూతురు.

"ఆ నడకలతోనేనే నేను నీకీ హంస నడకలు నేర్పింది. అవి చూసే ఆ రెడ్డబ్బాయి మోజుపడి నీ కాళ్ళకడ పడివుంది."

"ఆయన కాదే—నేనే ఆయన కాళ్ళకడ పడి ఉన్న."

"ఏమి టేమిటీ?"

"సమాజంలో మనకెంత గౌరవముందో తెల్సా తల్లీ నీకు?"

"మనకేమయిందని-దేవదాసీలం!"

"దాసీలం."

"ఇస్తావు నాయనా! ఎందుకివ్వవ్? నేను ఇన్నాళ్ళు దాన్ని పెంచింది ఇందుకోసమేనాయె" ప్లేటు ఫిరాయించింది; ముక్కు చీత్తూ ఏడ్పు మొదలుపెట్టింది ముసలమ్మ.

"ఏడవకమ్మా-నీకిప్పుడేం ప్రమాదం వచ్చిందని" వేమన అన్నాడు.

"ఇంకేం రావాలి నాయనా! ఎదిగిన కూతురు ఆటపాటలు నేర్చింది, దినం బంగారు గుడ్లు పెట్టే బాతు అవుతుందనుకుంటే"

"ఛీ! నోర్మూయ్" దేవదాసి తల్లిని కసిరింది.

"నువ్వూర్కో దేవీ!" వేమన వారించాడు.



"చూశారా అయ్యా-అదీ దాని వాలకం. తల్లినని ఇంగిత జ్ఞానమయినా లేదు"

"తల్లీ! ఇలాంటి తల్లి పగవారికయినా వద్దు దేవుడోయ్"

"చూశావా అయ్యా"

"ఏం కావాలమ్మా నీకు?" వేమన అడిగాడు.

"ఇంకేం కావాలి? మా అమ్మకు డబ్బు పిచ్చి జాస్తి"

చిన్న కూతురంది.

"ఓస్! అంతేకదా ఎంత కావాలి?"

"మీరూరుకోండి. దానివన్నీ దొంగ యేడుపులు" దేవదాసి అంది.

అటువారించి ఇటు తిరిగి "ఎంతకావాలమ్మా?" అన్నాడు.

"ఎంతిచ్చినా తక్కువే-నా బిడ్డ రతనాల బొమ్మ" నసుగుతూ అంది ముసలమ్మ.

"సరేలే విచారించకు. నువ్వన్నట్లే నిన్ను డబ్బుతో ముంచెత్తుతాను, సరేనా?" వేమన హామీ ఇచ్చాడు.

"మా తండ్రే!" సంబరంతో మెటికలు విరిచింది వేశ్యమాత. అటు తిరిగి కూతురుతో అంది.

"వెళ్ళమ్మా! అబ్బాయి ఎంతసేపని నిల్చుంటారు? ఎండనపడి వచ్చారు. దాహానికి మజ్జిగ ఇవ్వు"

"ఇనుప గజ్జెల తల్లి!" వెక్కిరించింది పుత్రిక.

"అనవే అను. బంగారు గజ్జెలనే నేను నా వయసులో కట్టుకున్నవి" చేతులు తిప్పుతూ అంది.

"ఆ బ్రతుకు బ్రతక్కపోతేనేం?"

"తలరాత" నెత్తిన కొట్టుకుంది ముసల్ది.

"చేతులారా చేసుకుంటూ తలరాతట-వాత"

ఆమె నోటిని మూసి వేమన లోపలికి నడిచాడు.

"మీరు మా అమ్మ మాటలు పట్టించుకోకండి"

"నీకెందుకా సంగతి?"

"నాకు కాకపోతే మరెవ్వరికి?"

"నాకు-"

"మీ సంగతి నాకు పట్టలేదా?"

"ఉంది కాని నాతోనే, డబ్బుతో కాదు"

"డబ్బిస్తే నామీద ఒట్టే"

"ఇవ్వను. మరి కథ రచ్చకెక్కుతుంది. మనం రద్దీ పాలవుతాం. నిన్ను వదలి నేను జీవించలేను"

"ఎక్కడైనా పారిపోదాం"

"మా వదిన నన్ను విడిచి వుండలేదు"

"మీ ఇష్టం" మూతి ముడిచింది.

"అలిగినా అందంగా వుంటావు ప్రియా నువ్వు"

"ఏడిస్తే ఇంకా బాగుంటా"

"ఏదీ ఏడ్వు" నవ్వుతుంది.

"ఏడ్వడమంటే నవ్వడమా?"

"మీరు దగ్గరుండగా ఏడ్వటం నాచేతనవుతుందా?"

"అంత ఆనందంగా వుంటుందా?"

"అవును మరి"

"నాకెలా వుందో చెప్పనా?"

"ఊఁ-"

"నీ ఒడిలో ఇలాగే నిశ్చింతగా హాయిగా చావాలని!"

"బాగుంది. మంచిదే కోరిక? మరెప్పుడిలా అమంగళం మాటలు పలక్కండి" ఏడుస్తుంది.

"సరే-ఏడవకు" ఇంకా ఏడ్చింది.

"నేను నిన్ను విడిచి జీవించలేను దేవీ"

"ఇప్పుడా బాధేం వచ్చింది?" కళ్ళు తుడుచుకుంటూ అంది.

"వస్తుందేమోనని"

"ఎందుకు-"

"జనం కోళ్ళై కూస్తున్నారు."

"అయితేనేం?"

"మా అన్నగారివరకూ వెళ్ళింది విషయం"

"ఏమన్నారు?"

"ఏమంటారు, లోకంలో వున్నమాటే-"

"ఏమిటి?"

"పెళ్ళిచేసుకొమ్మని"

"చేసుకోండి"

"ఎవర్ని-నిన్నా?"

"నన్నా?"

"నిన్నే అయితే నిరభ్యంతరంగా పెళ్ళాడేవాడిని"

"కులం కాదుకదా-"

"గుణం వుంది చాలు"

"పెద్దలొప్పుకోరుకదా?"

"అదే వచ్చిన చిక్కు-"

"మీరేమన్నారు?"

"ఏమనలేదు"

"చేసుకోండి"

"నీకు బాధగా వుండదా?"

"ఉండదు"

"నాకుంటుంది."

"ఇలాగే నన్ను మీదానిలా వుండనిస్తే చాలు"

"అదెలాగూ తప్పదనుకో"

"మరింకేం?"

"అదే నేననేది. ఇంకా వేరే పెళ్ళేమిటా? అని"

"కులంగోత్రం-"

"ఉద్ధరించేవాళ్ళు ఉద్ధరించుకోనీ"

"నన్నిలాగయినా వుండనీయరా?"

"ఉండాలనే"

"మీరు పెళ్ళి వద్దంటే మీ పెద్దవాళ్ళు మనమీద ఒత్తిడితెచ్చి మకు దూరం చేస్తారు"

"అదీ చూస్తాను ఏం చేస్తారో"

"అతిసాహసం"

"అదే పౌరుషమంటే"

"నాకు తెలవదు బాబోయ్!"

"కనకనే స్త్రీ వైనావ్"

"ఈరోజు ఉద్రేకంలో వున్నారు"

"అవును వున్నాను"

"ఆడేదా?"

"ఉహూ జోలపాడు నిద్రపోతాను"

"నిజమా?"

"పాడు! నిజమో కాదో ఆపై చూడు"

ఆమె నవ్వింది—అతడూ నవ్వాడు.

## వదిన నగలు కాజేశాడు

నరసమాంబకు మరదిపై ఎనలేని ప్రేమ. కూతురు జ్యోతి కంటే అతడంటే గారాబం. సొంత కొడుకులా చూస్తుంది. ఏదో సమాధానం చెప్పి తప్పుకునేవాడు వేమన-వేళకు భోజనానికి రానప్పుడు, వదిన-ఇదేమిటమ్మా? అని అడిగినప్పుడు. అడిగి కొన్ని అడగక కొన్ని వదిన నగలన్నీ కాజేశాడు. వాటినన్నింటినీ దేవదాసి తల్లికిచ్చాడు. ఆమె పోరు మానిందికాని అన్న పోరు పెరిగింది.

ఒకనాడు జ్యోతి తన తల్లి నగలు పెట్టుకుంటానని మారాం చేయసాగింది. ఆమె ఎంత వారించినా వినదు. అప్పుడే వచ్చిన రాచవేమన కూతురికి నగలిమ్మన్నాడు. తర్వాత ఇస్తానని మాట దాటవేసింది నరసమాంబ. ఆయన పట్టుపట్టి వెళ్ళి పెట్టె తెరచి చూశాడు. ఏముంది? పెట్టె ఖాళీ!

"ఇదా సంగతి? ఒంటిపై నగలు లేకుంటే అదేమిటోలే అనుకున్నాను ఇన్నాళ్ళు." అన్నాడు. ఆమె మారు పలుకలేదు.

"చెప్పవేం ఏమైనవి?"

"పెట్టెలోనే పెట్టాను." ఆమెకు ఏం చెప్పాలో తోస్తూలేదు.

"దొంగలు పడ్డారా?" - మౌనం.

"దయ్యాలు మాయం చేశాయా?" - ఆమె బదులు పలకలేదు.

"ఇది మీ ముద్దులమరిది చేసిన ఘనకార్యం కదూ?"

"ఏమోనండీ."

"అవునండీ! నాకు తెల్సు. వాడినేం చేయదల్చుకున్నావో నీ యిష్టం. ఆ నగలు నీవి. ఉంటే వాటిని అలంకరించుకునే దానివి నువ్వు. లేకుంటే బికారిలా ఉండేది నువ్వు. కాని నీ అతి గారాబంతోనే వాడిని పాడుచేస్తున్నావ్. ఎలా దారికి తెస్తావో నీ యిష్టం. వాన్ని ఓ యింటివాడినిచేసే బాధ్యతమాత్రం నీది."

ఆమె ఏమీ అనలేదు.

# అన్నతో పేచీ

చిలికి చిలికి ముసురు, గాలివాన అయినట్లు ఆ యింట్లో అలజడి పెద్ద దయింది. వదినకు మరది వినలేదు, మారలేదు. రాచవేమన్న తమ్ముని గట్టిగా మందలించాడు.

"అయిందేదో అయింది. నీ మూలంగా ఊళ్ళో తలెత్తుకొని తిరగలేక

"విడువకురా-గొప్ప పనే. కాని బుద్ధిగా పెళ్ళిచేసుకో. మామవాళ్ళు ఒత్తిడి చేస్తున్నారు. వయసొచ్చిన కుర్రాడికి సమయానికి పెళ్ళిచేయక ఇలా ఊరిపై వదిలానని నింద నాకు."

"నాకు ఏ పెళ్ళీ వద్దు."

"మరి?"

"ఇలాగే ఉంటా-"

"ఎలాగా-?"

"ఇప్పుడున్నట్లే."

"బాగుందిరా నీ వరస, ఇత్తడి పుత్తడి కాదు, తొత్తు దొరసాని కాదు. ఆ కులంకానిది నీకు పెళ్ళామవుతుందా?"

"అవుతుంది."

"అవుతుంది. ఎవరురా నిన్ను సహపంక్తికి రానిచ్చేది?"

"రానివ్వకపోతే చింతలేదు."

"ఎలా బాబూ అలాగంటే? నీకో బాబు పుడితే వంశం నిలుస్తుంది. అందుకోసమే ఎదురు చూస్తున్నాం నాయనా; నీ మీది ఆశతోనే మీ అన్నగారు నే నెన్నిచెప్పినా వినక మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు." వదిన అంది.

"అయితే ఏం పర్వాలేదు. జ్యోతికి పుట్టిన బాబును పెంచుకోవచ్చు."

"ఎలాగయ్యా ఇలా అంటే?"

"అలాగేనే. నీవు పెంచినవాడు, నీవు ఇచ్చిన గారాబం. వేశ్యను పెళ్ళాడుతాడట ఇప్పుడు." భర్త అన్నాడు.

"వేశ్యలెవరు ? మనుష్యులు కారా–" వేమన అన్నాడు.

"అంతా మనుషులే ఎందుకు కారు. కానయితే గౌరవం తక్కువ. అంతే." రాచవేమన వివరించాడు.

"ఎందుకు ? దేవతలని పూజలని అంగరంగ వైభోగాలని దేవదాసీలను తయారు చేసింది మీరు. మళ్ళీ వాళ్ళను చిన్నచూపు చూసేదీ మీరే."

"నాకు అంత పెద్ద ఆలోచనలు రావు – పెద్దల మార్గంలోనే నడుస్తున్నాం."

"మంచినైతే పెద్దలనుంచి స్వీకరించాలి. చెడు ఏదైనా పెద్దల దారిలో వుంటే వదలి పెట్టాలి."

"వచ్చేకాడు సంఘ సంస్కర్త–"

"ఎవరి కర్మలకు వారే కర్తలు–"

"లోకం నన్ను నిందిస్తున్నది కదా–"

"భారం నాపై త్రోసెయ్యండి–"

"వద్దు నాయనా ఆ మాట, మా మనసులు కష్టపెట్టకు." పదిన బాధతో అంది.

"నా మనసు వినదమ్మా"

"వినాలి నాయనా."

"ఎందుకే ఇంకా-కొలువుపెట్టి చెప్పగా తలుపుపెట్టి అడిగినట్లు. వినదట. వినక వెళ్ళి ఏ గంగలో కలుస్తాడో కలవనీ." కోపంతో అన్నాడు అన్న.

"అన్నగారి ఆశీర్వాదాన్ని శిరసా వహిస్తాను."

"నా ముందు నిలవకింక."

"అలాగే" వేమన వెళ్ళిపోయాడు.

"ఆగవయ్యా," అని వదిన పిలిచినా ఆగలేదు.

"ఎందుకండీ ఆయన్నలా వెళ్ళమన్నారు?" భర్తనడిగింది.

"ఆనందాన్ని అనుభవిద్దామని."

"అయ్యో దేవుడా!" ఆమె వ్యధ చెందింది.

"ఇక ఆ దేవుడే అదుకోవాలి మనల్ని." కన్నీటిని పై పంచెకొంగుతో ఒత్తుకున్నాడు రాచవేమన.

"మీరేడవకండి." అంటూ తాను కన్నీరు కార్చసాగింది.

"ఏడుపే మిగిలిందింక."

"ఎందుకండీ అంతగా రంది పడతారు. అతనే దారికి వస్తాడు."

"ఆ ఆశ కలిపించడంలేదు. అడ్డాలనాడే బిడ్డలుకాని గడ్డాలనాడు కాదు. సొంత కొడుకులే వినని పాడు కాలమిది. అందులో తోడబుట్టినవాడు ఎలా వింటాడు. వానికి పౌరుషం జాస్తి. మొండిఘటం. దారికి వస్తాడనే నమ్మికలేదు."

"అలా దిగులు పడకండి తప్పక బుద్ధి వస్తుంది. మారతాడు. పదండి భోంచేద్దురు."

"ఇంటికి వచ్చినవాన్ని తిననీయకుండా పంపించాను."

"ఎక్కడో తింటాడు. ఉపవాసముండడు-మీరు లేవండి."

"నాకు ఆకలిగాలేదు."

"సరే" ఆమె వంటింటిలో పాత్రలు సర్దడానికి వెళ్ళింది.

## పెళ్ళి ప్రయత్నాలు

దేవదాసి చెల్లెలు వీధివెంట పోతుండగా వేమన్న వరస మరదలు లక్ష్మి దారిలో కల్పింది. ఆ అమ్మాయిని వేమన్న కివ్వాలని పెద్దల ఉద్దేశ్యం కాని ఇంకా నిర్ణయం కాలేదు. ఆశచావలేదు.

"ఓ బోగమోరి పడుచా! జోరుగా పోతున్నావ్-కొంచెమాగు."

"ఏం కాపోరి పడుచా! ఏమిటి విశేషం?"

"ఏమిటే పడుచా అంటున్నావ్?"

"నన్ననలేదా నువ్వు?"

"నిన్నంటే నన్నంటావా?"

"ఏం అనకపోతే భయమా."

"మీకెందుకు భయం-సిగ్గా-ఎగ్గా-?"

"ఏయ్ మాటలు తిన్నగా రానియ్యి."

"ఏం ఎందుకు?" అంటూ బాట ప్రక్కకు నడిచింది.

"వంకర మాటలంటే ఊరుకునేది లేదు." దగ్గరికి వెళ్తూ అంది.

"వంకర చేతలైతే బాగుంటవా" వెక్కిరించింది లక్ష్మి.

"ఎవరివి వంకర చేతలు?"

"మీవి."

"ఎందుకో."

"ఛీ! మంది మగాళ్ళతో."

"ఊ....ఇంకా."

"రోత."

"అలాగనా?"

"కాకపోతేనేం?"

"మీరు బుద్ధికలవాళ్ళయితే మీ మగాళ్ళు మా యిళ్ళ చుట్టూ ఎందుకు తిరుగుతారమ్మా!?"

"ఏమంటున్నావ్?"

"వున్నమాటే అంటున్న."

"ఏమిటీ?"

"సరేకాని, నీ పెళ్ళెప్పుడు? పప్పన్నం అరిసెలు ఎప్పుడు తినిపిస్తావ్!"

"నా రాత కదొకటా."

"ఏమైందమ్మా! కల్యాణఘడిన రాలేదా యింకా?"

"మా బావ ఇంటిపట్టున వుంటేకదా."

"ఏమైందట."

"ఏం మాయదారి చచ్చిన రోగమో. ఎక్కడెక్కడో తిరుగుతున్నాడట. ఇంటికి రావడమే మానేశాడట."

"ఎటు పోతున్నాడో"

"నాకేం తెల్సు"

"ఏమీ తెలువలేదా?"

"ఎలా చెప్పాలమ్మా ఈ నోటితో"

"మహారాణిలా"

"భోగం కొంపలవెంట తిరుగుతున్నాడట కదా"

"కావచ్చును-నాకేం తెల్సు?"

"నీ దయనే. కొంచెం జాడచెప్పి పుణ్యం కట్టుకో"

"ఏం చేస్తావేమిటే?"

"మా వాళ్ళకు చెప్పి ఆ ముండను ఊరినుంచి బయటకు పంపిస్త"

"అదంత సులువుకాదు. నీ బావా నీకు దక్కడు. బలవంతాన ఏ పనీ జరగదు"

"మరేం చేయనే?"

"నువ్వే ఆలోచించు"

"నేనే వెళ్ళి బావ పాదాలపై పడి బ్రతిమిలాడుకుంటా"

"ఇది మంచి మార్గమే. కాని మా ఇండ్లకువస్తే మీ కులకాంతల పరువు ఉంటదటమ్మా?"

"ఏం చేయను. కాని కాలం వచ్చినప్పుడు వసుదేవుడు గాడిదకాళ్ళు పట్టుకోలేదూ?"

"విశ్వామిత్రుడు కుక్కమాంసం తినలేదూ?"

"వెక్కిరించకు"

"చక్కని ఆలోచనేకాని, నేనో మాట చెప్తాను విను. మీ బావ మా అక్కదగ్గరే వుంటున్నాడు. ఆమె ఎంతచెపితే అంత"

"ఆమెను బ్రతిమిలాడనా?"

"బావను పెళ్ళాడుతాననా?"

"అనే కదా నేననేది?"

"అతడు వినడుకదా-అని నేననేది"

"మరేం చేయాలె-"

"ఇలా పాతకాలపు ముసలమ్మవేషాలు పనికిరావు. కాస్త నాజూగ్గా, తళుకింపుగావుండే దుస్తులేసుకో"

"మీ వేషాలు మాకు రావే"

"రాకపోతే నీ బావ ఆశ వదలుకోవే"

"మనసొప్పదే"

"అందుకే నేను చెప్పింది ఒప్పుకో. అందంగా అలంకరించుకొని నీ బావ కనిపించినప్పుడు వెంటపడు"

"దారికాచేదా?"

"ఇంక నీ పుణ్యం! నావెంట నడుస్తాననలేదు"

"వద్దామనే వుంది

"వద్దుతల్లీ నీకో దండం!"

"మరి?"

"మీ బావగారింట్లో తిష్టవెయ్యి. పాతొక రోత కొత్తొక వింత, అని నీ రొట్టె విరిగి నేతిన పడవచ్చు! ప్రయత్నించి చూడు. ఎవరి భాగ్యం ఎట్లున్నదో ఎవరు కలగన్నారు"

"వస్తానే. నీ మేలు మరచిపోను"

"సరే. ఈ మల్లెపూలు తీసుకో"

"సరే ఇవ్వు. పూలిస్తానంటే వద్దనకూడదు"

"మా అక్క ముడిచేపూలు మీ బావ వాసనచూసే పూలు. ఎక్కడైతే నేమిలే పూజించే దొకరినేకదా!"

"ఛీ పోవే!" పూలు తీసుకుంది.

"పోతున్నాలే జాగ్రత్తసుమా"



"సరే కాని, నీకు మీ అక్కంటే కోపమా? నాకింతగా సహకరిస్తున్నావ్"

"కాదు. మా అక్క చాలా మంచిది. దేవత! కాని నిన్ను చూస్తే జాలి వేస్తున్నది. పైగా వేమన్నకు పెళ్ళయితేనే మా అక్కకు భద్రత. లేకుంటే పెద్ద వాళ్ళతో ఎప్పుడేం గొడవ వస్తుందోనని భయంగా వుంది"

"అలాగా" అని లక్ష్మి కదిలింది, పూలసజ్జతో. ఈ పిల్ల సైతం ఇంటికి వెళ్ళింది.

లక్ష్మి వెళ్ళి నరసమాంబతో ముచ్చట్లలో దిగి అక్కడే కూర్చుండి పోయింది. ఆ పిల్ల మనసు తెలుసుకొని ఆమెకూ శుభసూచకంగా తోచింది. కాని వేమన ఇంటికి వచ్చినా ఆమెవైపు కన్నెత్తి చూడలేదు. మరదలు కావాలని పలకరించినా దూరం వెళ్ళాడు.

"మరదలు నీకోసం పొద్దుటినుంచి ఎదురు చూస్తున్నదయ్యా పాపం! వెళ్ళి పలకరించు" వదిన నవ్వుతూ అంది.

"ఇదుగో వదినా! ఇలా నన్ను బాధించకండి. నేను ఇంటికిరావటం ఇష్టంలేకపోతే చెప్పండి. అన్నయ్యవలెనే మీరనుకుంటా"

ఆమె మారుపలుకలేదింక.

"హుం! ఇంతపాటి అందగాడు లోకంలోలేనట్లు. ఈయనగారు పెళ్ళాడక పోతే ఇక నేను ఇలాగే వుంటానో" అని లక్ష్మి ఉక్రోశంతో చరచర వెళ్ళి పోయింది.

## వదిన హితబోధ

"లక్ష్మి మంచిపిల్ల!" నరసమాంబ అన్నది.

"అవును" ఒప్పుకున్నాడు వేమన.

"ఎందుకు ఆ అమ్మాయి మనసును నొప్పించావ్?"

"అనవసరంగా ఆ అమాయకురాలు నాపై ఆశలు పెంచుకోవద్దని"

"ఇదెక్కడి విపరీతం"

"ఇక్కడిదే"

"ఇంత మొండిపట్టుదలా?"

"జీవధనములు యిన చెడుగాక పడుగాక
మాట తప్పలేరు మాన ధనులు!"

"ఏమాట?"

"నేనిచ్చినమాట"

"ఎవరికిచ్చావ్?"

"మీ చెల్లెలికి"

"ఎవరా అదృష్టజాతకురాలు?"

"నా సహచరి!"

"దేవదాసా?"

"ఆమెనే"

"ఏమన్నావు?"

"భార్యాభర్తల మనుకున్నాం"

"దాన్ని పెళ్ళాడుతావా?"

"ఆడాను!"

"ఆ ? !"

"అవునమ్మా"

"మాతో మాటమాత్రమైనా చెప్పకుండా"

"పోట్లాడుతూ చెప్పాను గదమ్మా"

"బాగుంది వరస నీకేం తక్కువయింది చెప్పు-చక్కగా కులం పిల్లను పెళ్ళిచేసుకోక"

"కులం పిల్లను యెవరయినా చేసుకుంటారుకదమ్మా. కులంకాని పిల్లను చేసుకుంటేనే ఆమెకు గౌరవం"

"వాళ్ళతో వీళ్ళ గౌరవం పోతుందికదా"

"ఈ మగాళ్ళు తమ స్వార్థానికి వాళ్ళనలా దిగజార్చారు వదినా. మళ్ళీ కొందరు నాలాంటి మగవాళ్ళే వాళ్ళకు గౌరవస్థానాన్ని కల్పించాలి.నీలాంటి ఉదార వతులు అందుకు తోడ్పడాలి. స్త్రీజాతి ఉద్ధరణకు స్త్రీలే సహకరించకపోతే ఎలా చెప్పు?"

"ఏమిటో నీదంతా వితండవాదం"

"మా వదినకు తెల్పు-నేను నిజమే మాట్లాడుతున్నానని"

"సరి, పెళ్ళెప్పుడయింది"

"నీ చేతిలోవుంది"

"ఏమిటి?"

"నీవు ఆశీర్వదించినప్పుడు"

"ఇక్కడికి తీసుకొస్తావా ఏమిటి?"

"మీరు రమ్మనందే రాము"

"అక్కడికి రావాలా మరి?"

"మైల సోకుతుంది కదా మీకు"

"మరి?"

"ముత్తయిదువ చిహ్నంగా మీ ముక్కెర ఇచ్చి దీవించండి"

"చివరికి మిగిలింది ఇదొక్కటే"

"అదే మా పెళ్ళి చిహ్నం"

"ఇదెక్కడి కలికాలం?"

"శుభకార్యం!"

"ముత్తయిదువ ముక్కెర తీసి యిస్తుందటయ్యా"

"వదినా-ఈ ఒక్క కోర్కను తీర్చవమ్మా. ఇంక జీవితంలో నేనేదీ కోరను."

ఆలోచన పాలైంది నరసమాంబ. చివరి ప్రయత్నంగా ఆమెకో ఉపాయం స్ఫురించింది.

"సరే ఇస్తాను కాని ఒక నిబంధన" నిశ్చలంగా అంది.

"చెప్పెయ్యి. నిప్పులో దూకుమన్నా దూకేస్తా"

"అంత సాహసం ఏమీ అక్కర్లేదు"

"మరి?"

"దీనిని ఆమెకు ఇచ్చేటప్పుడు నగ్నంగా వెనుకకు మొగ్గవాలి తీసుకొమ్మను"



సిగ్గుతో తల ప్రక్కకు తిప్పుకొని నవ్వుతూ కళ్ళుమూసుకొన్నాడు.

"సరే, నీవన్నట్లే-" అన్నాడు

"మాట తప్పవద్దు సుమా"

"నీమీద ఒట్టు-సరేనా?"

అతని ముఖంలో నవ్వు చెదరిపోలేదు. ఆమె ముఖం గంభీరంగానే వుంది. వదిన ఇచ్చిన ఆభరణం తీసుకొని బయటపడ్డాడు.

# అభిరామయ్య కలిశాడు

ఊపులో వెళ్తున్న వేమన దారిలో అభిరామయ్యను తాకినంత పని చేశాడు. అతడు భయంతో తప్పుకొని ప్రక్కకు నిలిచాడు. అభిరామాచారి ఆ వూళ్ళో పేరున్న స్వర్ణకారుడు. వీరింటి నగలు అతడే చేస్తాడు. నియమ నిష్ఠలు నిజాయితీ కళాకుశలత్వం కల ఆ స్వర్ణ శిల్పికి ఊళ్ళో మంచి గౌరవం వుంది.

"తాకుతావా యేం? ఏమిటా దూకుడు-కాస్త దూరంగా వుండు-" అన్నాడాయన వేమన్నతో.

"ఏం, తాకితే మైల పడిపోతావా?"

"కాదా మరి? మడిలో వున్నానయ్యా. దేవాలయానికి పూజకు వెళ్తున్నాను. కనిపిస్తూలేదూ?"

"ఓహోహో! పట్టుబట్టమడా?"

"ఆ-పట్టుబట్టో గోనెపట్టో, మడంటే మడే"

"సరేకాని అభిరామయ్యగారూ! తడిబట్ట గోనెపట్టా మడులు తెల్సు కాని, ఇంటిమడి అంటే ఏమిటి?"

"నా పిండాకూడు. జరుగవయ్యా. కొంచెం పక్కకు తప్పుకో."

"అంత తొందరా?"

"కాదా మరి"

"ఓ-దైవ మందిరానికి వెళ్తున్నావు కదూ!"



"అవును మరి. సరేకాని, ఇంతకు నువ్వెక్కడికి?"

"దేవీ మందిరానికి!" అని నవ్వుతూ వెళ్ళాడు.

"శివ శివ!" అని అభిరామయ్య ఇలా-

"బ్రహ్మమురారి సురార్చిత లింగం
నిర్మలభాసిత శోభితలింగం-"

చదువుకుంటూ వెళ్ళాడు-

# విరాగి అయ్యాడు

దేవదాసి తల్లి వేమనపై అభిమానంతోనే వుంది. ఆయన తెచ్చి ఇచ్చిన విలువైన బంగారు నగలవల్ల ఆమెనోరు మూతపడింది. పైగా తాత్కాలిక వ్యామోహంతో కాక కూతురుపై నిలకడైన మనస్సుతో వేమన్న ప్రేమతో వుండటం ఆమెకూ కొంత తృప్తిగావుంది. ఏమో-తెలిసీ తెలియని వెర్రికాలాన తమ బ్రతుకులే రద్దిపాలైనవి. కుక్కలు చింపిన విస్తరిలాంటి పాడు జీవితాలు తమవి. తన కూతురైనా ఈ రొంపిలో కాలుపెట్టక ఓ చక్కనయ్య చల్లనిచూపులో సుఖంగా గౌరవంగా మనగలుగుతుందనే ఆశ ఆ ముదుసలికి ఆనందాన్ని కలిగించింది. ఎంత డబ్బు కక్కుర్తి వున్నా ఆమెసైతం ఆడ మనిషేనయ్యె. స్త్రీజాతికి సహజమైన సుశీలంపై ఆసక్తి సంతానం మీది అనురాగం ఏడ పోతయ్.

"నువ్వడిగిన ముక్కెర తెచ్చాను ప్రియా!" ఏకాంత సమయంలో ప్రేయసితో అన్నాడు వేమన.

"నిజంగానా!" ఆమె నమ్మలేకపోయింది.

"నువ్వడగటం నేను కాదనటమా?"

"ఇది నేను మీకు పెట్టిన చివరి పరీక్ష"

"నువ్వే నెగ్గావు"

"కాదు-మీరే నెగ్గారు"

"ఊహూ. ఇద్దరం నెగ్గాం! సరేనా?"

"ఇక మన ప్రేమకు చలనంలేదు"

"ఇన్నాళ్ళు ఉందనుకున్నావా?"

"అనుమానం వుంటే కొంత ఏమూలో"

"ఇంతేనా నువ్వు నన్ను అర్థం చేసుకుంది?"

"ఏమో ఎవరు చెప్పగలరు మగవాళ్ళ!"

"మగువల వలె—"

"ఎగతాళి"

"తాళికి ముందు"

"ఊ. ఇవ్వండి"

"తాళు కొంత"

"ఇంకెందు కాలస్యం"

"ఒక్కమాట"

"వెయ్యి చెప్పండి-తర్వాత వింటా-"

"ముందు ఒక్కటి విను చాలు"

"చెప్పండి"

"ఈ ముక్కెర ధరించుకోవటానికి ఒక నియమం"

"అదేమిటో సెలవియ్యండి"

"దీన్ని మామూలుగా తీసుకోకూడదు"

"ఎలాగ తీసుకోవాలటమరి"

"ఇలాగా" అని చెవిలో చెప్పాడు.

ఆమె సిగ్గుతో మొగ్గయిపోయింది.

"ఛీ" అంది.

"అంతేమరి"

"ఊహూ"

"అయితే ఇవ్వను"

"అయితే వెళ్ళండి"

"వెళ్ళను"

"ఇవ్వండిమరి"

"ఇవ్వను"

"ఇదెక్కడి చిక్కు స్వామీ"

"తప్పదు భామామణీ!"

"నిజంగానా?"

"నీతో అబద్ధం చెప్తానా?"

"అయితే సరి"

"అదీ బుద్ధిమంతురాలి లక్షణం"

ఆమె అతడు చెప్పినట్లు చేసింది. అతడలాగే ఆమె శరీరాన్ని చూస్తూ నిలిచాడు.

"ఇవ్వండి"

ఇవ్వలేదు. ముందుకు చాచిన చేయి వెనక్కులాక్కున్నాడు. వెర్రివాని వలె ఉద్రేకంతో ఊగిపోయాడు.

"ఇవ్వరేం-"

"ఇంకెక్కడి ఇవ్వడం? ఈ రక్తమాంసాల మలినపు తోలుతిత్తి కోసమా ఇన్నాళ్ళు నేను వెర్రినై వెంపరలాడింది! తల్లీ నరసమాంబా!నా కన్నులు తెరిపించావ్. నన్ను క్షమించు"

"ప్రభూ"

ఆమె మాటలు వినిపించుకోలేదు. వెనుదిరిగి ఒక్కటే పరుగు. ఆమె అవమానంతో తలవంచుకుంది.

అతడింక ఆ ఇంటి ఛాయలకు పోలేదు.

అతడు వెళ్ళి వదిన చేతిలో ముక్కెరనుంచి ఆమె పాదాలపైబడి పసి పిల్లవానిలా వెక్కి వెక్కి ఏడ్చాడు. ఆమె వాత్సల్యంతో మరది తలనిమిరి లేవ నెత్తి ఓదార్చింది.

కథ మలుపు తిరిగింది.



వదిన తలచింది ఒకటైతే జరిగింది మరొకటి. వేశ్యపై విముఖతతో వేమన ఇంటికి తిరిగివచ్చి బాగుపడతాడనుకుంది. కాని, ఆయనకు మనసులో రోత జనించింది. ప్రేమ, పెళ్ళి అన్నీ వ్యర్థ విషయాలుగా తోచసాగాయి.

## మనోవేదన

ఎప్పుడూ మూగగా గడపసాగాడు వేమన. పది మాటలకు ఒక మాట

పలికేది కష్టం. భోజనంవేళ వంటలు మెచ్చుతూ వెక్కిరిస్తూ నానా హంగామా చేసే వాడు ఇప్పుడు పల్లెత్తుమాట అనడు. ఏది పెడితే అది ఇంత తిని లేస్తాడు. అది కావాలనడు ఇది వద్దనడు. అంతా అదో మాదిరిగా మారిపోయాడు.

జ్యోతిని ఆటపాటలతో అల్లరిపెట్టేవాడు ఇన్నాళ్ళు. ఇప్పుడు ఆమెను పలకరించడు. చెంతకువచ్చి నిలిచినా, మాట్లాడినా పట్టించుకోడు.

ఏదయినా గ్రహం సోకిందో, ఆ మాయలమారి ఏదయినా మందు పెట్టిందో అని నరసమాంబకు వెయ్యి ఆలోచనలు-ఆవేదనలు.

వైద్యునికి చూపినా లాభం కనిపించలేదు. అన్నగారికి మరో దుగ్ధ పట్టుకుంది. ఇన్నాళ్ళు ఇంటిపట్టున ఉంటూ లేడే అనే బాధ. ఇప్పుడిదేం ఖర్మరా అనే వ్యథ. తమ్ముని తిరిగి దేవదాసి ఇంటికే పంపించే ప్రయత్నం చేసాడు. అతడు వినలేదు. ఎవరేం చేసినా-చెప్పినా వేమన్న మనసును మార్చలేకపోయారు. రోగమేమీ లేదని వైద్యులంటున్నారు. విషయం అర్థంకానిదిగా వుంది. తొందరపడి మాటలతో నొప్పించి మరీ దూరం చేసుకోకూడదనుకున్నారు కుటుంబ పెద్దలు.

బాలుని విధంగా వుంది వేమన పరిస్థితి. ఎక్కడెక్కడో గుట్టలు, చెట్లు తిరిగేవాడు. గంటల తరబడి మూగనోము పట్టినట్లు ఉలుకు పలుకు లేకుండా కూర్చుని వుండేవాడు. రాత్రి తెలియదు-పగలు తెలియదు. ఆకలెరుగడు దాహ మెరుగడు.

# స్వర్ణం తయారీ

పరుసవేది విద్యతో మామూలు లోహాలను బంగారం చేయవచ్చునని చెప్తుంటారు కొందరు. అదే స్వర్ణకారక విద్య.

భారతదేశంలో ఆచార్య నాగార్జునుడు బంగారం చేయడానికి బట్టీలుపెట్టి చేసిన ప్రయత్నాలతోనే రసాయనిక శాస్త్రానికి ఆద్యుడయ్యాడట।

భారతంలో దుర్యోధనుని చేతిలో పరుసవేది శక్తి-బలం వుందని, ధర్మరాజు రాజసూయ యాగ సందర్భంలో ప్రస్తావన వుంది. ఆతడు రాయి ముడితే చాలు బంగారమయ్యేదట.

ఏవో కొన్ని ప్రత్యేక వనమూలికల రసం పిండి మంత్రాలు చదువుతూ వండి దానిలో ఏదివేసినా మనిషిని వేసినా బంగారంలోకి మారిపోతుందని భట్టివిక్రమార్క కథల్లో వుంది. కాకతి ప్రతాప రుద్రుని విషయంలోనూ ఓ కథ పరుశవేదికి సంబంధించి వుంది.

విశ్వకవి రవీంద్రనాథుని తండ్రి దేవేంద్రనాథఠాకూరు సైతం బంగారం చేయడానికి బహు ప్రయాస పడినారట.

ఇనుము సంగతేమోకాని రాగి, వెండి లోహాలను కొన్ని పదార్థాలతో పుటం పెడితే—భట్టీలో వుడికించితే బంగారం అవుతుందని మనవాళ్ళ విశ్వాసం.

వేమనకుకూడా దానిపై ధ్యాస మళ్ళింది.

ఉప్పు చింతపండు ఊరిలో నుండగా
కరువదేల వచ్చె కాపులార!
తావళంబెరుగరో-తగరంబు నెరుగరో?
విశ్వదాభిరామ—వినురవేమ.

అని వేమన పద్యాల్లో ఒక పద్యముంది. ఇందులోనిది స్వర్ణకారక విద్యను గూర్చిన ప్రస్తావనమేనట.



అభిరాముడు అగసాలికదా. అతనికీ ఈ విద్యపై మక్కువ-సాధించా లనే కోరిక వుంది. అక్కడక్కడ ప్రాచీన తాళపత్రాల్లో వ్రాసివున్న విషయాలు కొన్ని, తాను విన్నవి కొన్ని జోడించి "ఇలా చెయ్యాలి ఆలా చెయ్యాలి" అని బడాయిలు చెప్పేవాడేమో. వేమన దానిని నమ్మవచ్చును.

బంగారం కాదుకాని బంగారు రంగులోకి మారిన లోహం లభిస్తుంది. అని ఇప్పటికీ చెప్తారు అనుభవం కలవాళ్ళు.

వేమన్న అభిరామునితో కలసి బంగారం తయారుచేయటానికి ప్రయత్నాలు సాగించాడు.

అతనికి తనమూలంగా ఇల్లు దివాలా తీసినందుకు బాధగా వుంది. అన్న గారి ఆర్థిక పరిస్థితి దిగజారి వుంది. ఒంటినిండుగా అమూల్యాభరణాలతో ఆలయం లోని అమ్మవారిలా కళకళలాడుతూ కనిపించే వదిన నరసమాంబ బోసిమెడతో కళతరిగి కన్పించడం అతడు చూడలేకపోయాడు. బంగారం తయారుచేయాలి. వదినను ఎప్పటివలె నగలతో ముంచెత్తాలి. అన్నను ఆర్థికంగా ఆదుకోవాలి. అదే అతని కోర్కె. అందుకే అతని తపన. కాని ప్రయోజనం కన్పించలేదు. పరిశ్రమ అంతా వృథా ప్రయాసే అయింది. నిరాశ మిగిలింది.

## అభిరాముని కోరిక

అభిరామాచారి ప్రతిరోజూ ఉదయంపూట పాల పాత్రతో కొండ మార్గం వెంటవెళ్ళి ఒక గుహలోని సాధుకు ఇచ్చివస్తుండేవాడు. అది ఏదయినా

మహిమల ఆశవల్లనే కాలేదు, కాదా-భక్తివల్లనే కాలేదు, కాని కొన్నాళ్ళనుండి అతడు క్రమం తప్పక పాటిస్తున్న సత్కార్యం అది.

వేమన అది గమనించాడు. ఒకనాడు రహస్యంగా వెంటవెళ్ళి అతని పని గమనించి వచ్చాడుకూడా ఇతడేమీ అడగలేదు. ఆతడు చెప్పలేదు.

ఓ దినం అభిరాముడు జ్వరం వచ్చి ఆయాసంతో వున్నాడు. అందు కతడు విచారపడలేదుకాని, సాధుకు పాలు తీసుకువెళ్ళడానికి వీలుకానందుకు బాధ పడ్డాడు.

వేమన్న సహాయాన్ని కోరాడు. ఆతడు కాదనక అంగీకరించాడు.పాల చెంబుతోపాటు కొండమార్గం పట్టాడు.

## గురూపదేశం

ఆ సాధు పేరు లంబికా శివయోగి.

వేమన ఆ శివయోగి ముందు పాల పాత్ర వుంచాడు. వెళ్ళినది క్రొత్త సాధు సన్యాసుల పరిచయం అంతగా లేనివాడు. అక్కడే ఒక ప్రక్కన నిలిచాడు. ఆయన చంచలమయిన మనస్సుకు అక్కడ ప్రశాంతిగా వుంది.

కొంతసేపటికి కనులు తెరచి "ఎవరు అభిరామయ్యా!" అని పిలిచాడు యోగి.

"స్వామీ!" వేమన్న బదులిచ్చాడు.

"చాల రోజులనుండి శ్రమపడుతూ ఇంతదూరం నడచివచ్చి నాకు క్షీరదానం చేస్తున్నావు నాయనా! నీకు ఈ దినం అమృతదానం చేస్తాను"

కాదనలేదు. తాను అభిరాముడను కాననీ అనలేదు. మౌనంగా చేతులు బంధించుకొని కూర్చున్నాడు. చీకటి గుహలో అస్పష్టంగా కన్పించినా గురుముఖం వింత తేజస్సుతో మెరిసిపోతున్నది.

ఆయన తనముందున్న వ్యక్తిని చూడలేదు. ఎక్కడో దూరాన దృష్టి నుంచి ఆత్మ స్వరూపాన్ని నిర్వచించి మోక్ష వివరాలను తెలియజేసాడు. మనిషి జన్మించినందుకు పరోపకారంలోనే జన్మ సార్ధక్యం వుందన్నాడు.

"సంసారాన్ని త్యజించి సన్యాసంతో జీవించడం ఘనత కాదా స్వామీ?" అన్నాడు భక్తుడు.

"కాదు నాయనా! దానివల్ల ఆ సాధకునికి ఒక్కనికే ప్రశాంతి-విముక్తి లభ్యం అయితే కావచ్చు కాని, ఈ విశాల లోకంలో కోట్లాది నరులు అజ్ఞానంతో, అల్ప వాంఛలతో, రోగాలతో, దారిద్ర్యంతో, నిరంతరం దుఃఖాల పాలవుతున్నారు. అట్టివారికి సహకరించడమే జ్ఞాని చేయవల్సిన పని. జీవుడే దేవుడు! మానవసేవయే మాధవ సేవ" అని సెలవిచ్చాడు యోగి.

"ధన్యుడను స్వామీ"

"స్వస్తి" (శుభమగుకాక)

"అయ్యా! మీరు నన్ను క్షమించాలి"

"ఎందుకు?"

"నేను అభిరాముడనుకాను"

"మరి ఎవరివి?"



"కాపు బిడ్డను-రెడ్డి వేమన అని అంటారు"

"రెడ్డి వేమన అంటే?"

"కొండవీటి రాచవేమన సోదరుడను"

"ఇంకా పరమాత్మ తత్వం నీకర్థంకాలేదా నాయనా? నేను అనేది ఆత్మే కాని ఈ శరీరం కాదని మరచిపోయావా?ఆత్మకు ఈ బంధుత్వాలన్నీ ఎక్కడివి?"

"క్షమించండి స్వామీ అజ్ఞానంతో పలికాను"

"అజ్ఞాన అంధకారాన్ని తొలగించువాడే గురువు ఆ ముసుగునుంచి బయటపడినవాడే జ్ఞాని. నేనెవరు? నీవెవరు? అతనెవరు? సర్వం శివమయం. అభి రామునికి నా ఆశీస్సులు అందించు. ఇక్కడికి రేపు రావలసిన పనిలేదను. నేనీ దినమే ప్రయాణమవుతున్నాను."

"ఎక్కడికి?"

"మరో చోటికి. అజ్ఞాని తిరిగితే కష్టం. జ్ఞాని తిరగకపోతే నష్టం. జ్ఞాని ఒకేచోట వుండకూడదు నాయనా. విజ్ఞాన కాంతిని ప్రసరింపజేస్తూ, అంధకారాన్ని తొలగించుతూ సంచరిస్తూనే వుండాలి. నేనిక్కడికి వచ్చిన కార్యం నెరవేరింది. మరో చోటికి వెళ్ళాలిక"

నమస్కరించాడు వేమన.

"సర్వం శివార్పితం" గురువన్నాడు.

## వేమన మారాడు

ఆయన అంతరంగంలోని అలజడి అంతమయింది. వదిన హితబోధ కారణంగా దేవదాసిపై ప్రేమ నశించింది. అయినా మనసు సంచలనంగా వుండేది. ఈనాడు మనస్సు నెమ్మదిపడింది. జీవిత పరమార్థం ఏమిటో తెలిసినట్లయింది.

అదే గిరి గుహముందు నిర్జనారణ్యంలో ఒక చెట్టుక్రింద రాతిపైన యోగధ్యానంలో కూర్చున్నాడు. ఆకలిలేదు దప్పికలేదు. ఎన్ని గంటలు కూర్చు న్నాడో ప్రొద్దు పడమటికి వాలింది. మిత్రునికోసం వెదకుతూ అభిరామయ్య వచ్చే వరకూ అలాగే కూర్చున్నాడు.

రెండుమూడుసార్లు పిలిస్తేకాని కన్ను తెరవలేదు.

"ఏమిటిది వేమన్నా?"

"ఏమిటేమిటి?"

"ఇక్కడ కూర్చున్నావు?"

నవ్వాడు. ఆ నవ్వు నవ్వులాలేదు. నవ్యంగా వుంది. వేదాంతిలా వుంది వెర్రిగా వుంది.

"వింతగా వుంది నాకు! ఏమిటిది వేమన్నా? ఇక్కడ కూర్చున్నావేమిటి ఇంటికి రాక"

"ఇల్లు ఇల్లెవరిది? తానెవరు!"

"ఇదేమిటి? కొత్తగా మాట్లాడుతున్నావే"

"అజ్ఞానంలో వున్నంతవరకు అంతా వింతే. వెలుగు చేరితే చీకటి అంతరిస్తుంది"

"జీవితం గల్లంతవుతుంది"

"అంతేకదా"

"ఏమిటి వేమనా?"

"జీవిత పరమార్థం ఏమిటో గ్రహించావా యెప్పుడయినా?"

"లేదు"

"అందుకే నువ్వు అభిరామునివి!"

"ఏమిటి వేమనా?"

"ఏమీలేదు"

"సరే-గురువుగారెక్కడ?"

"వారు లేరు వెళ్ళిపోయారు"

"అయ్యో! ఉపదేశం లభిస్తుందని ఆశించానే"

"నాకు లభించింది"

"నాకు ఆశాభంగమయింది."

"నేనెవరు? నీవెవరు?"

"వేమన్నా!"

"నీకు ఆశాభంగమయితే అందుకు నన్ను క్షమించు"

"అవశ్యం అనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం"

"జ్ఞానివి"

"సరేకాని, పద వెళ్దాం"

"నాకెక్కడికీ రావాలనిలేదు"

"ఇక్కడే వుంటావా ఏమిటి?"

"ఎక్కడయినా వుంటాను"

"మీవాళ్ళు నీపై బెంగతో వున్నారు."

"నేను-నావాళు-ఆశలు-అంతా భ్రాంతి."

"ఇదేం వైరాగ్యం?"

"వైరాగ్యమే"

"యోగివౌతావా?"

"సందేహమా"

"ఇదేమిటి మొన్నటివరకేమో ప్రేమ ప్రేమ అంటూ సానికొంప వెంట తిరిగావు. ఇప్పుడేమో ఇట్లా వేదాంతం మాట్లాడుతున్నావు. అంతా నీది వికట కవిత్వం"

"కామి కాని వాడు కవికాడు రవికాడు
కామి కాక మోక్షగామి కాడు"

"ఇదేమిటి వేమన్నా మాటలేదో లయలో వస్తున్నాయే. అలాగే అంటూ పో"

"కామి కానివాడు కవికాడు రవికాడు
కామికాక మోక్షగామి కాడు,
కామి యైన వాడు కవియౌను రవియౌను"

"అహో పద్యపాదాలు—ఆటవెలది చరణాలు!
ఇన గణ త్రయంబు ఇంద్ర ద్వయంబును
హంస పంచకంబు ఆటవెలది.

చక్కగా యతులు, గణాలు కుదిరినై. నాలుగవ పాదం పూర్తిచెయ్యి వేమన్న. చక్కని పద్యం. అనుభవ సారం"

"నాలుగవ పాదంలో నిన్ను బంధిస్తాను అభిరామయ్యా—

విశ్వదాభిరామ వినురవేమ!"

"ఆహా యెంతో బాగుంది. అయినా నా పేరెందుకిందులో"

"నా మిత్రుడవు. పవిత్ర వర్తనుడవు. గురు కరుణను నాపై ప్రసరింప జేసిన పుణ్యవంతుడవు. నాలో ఊపిరి ఆడుతున్నంతవరకు నీవు నావెంట వుండ వల్సిందే"

"వేమన్నా"



"అభిరాముని వేమనను."

"అయితే పై పాదం-విశ్వదుడవయిన అభిరాముని వేమా విను-అనా అర్థం?"

నవ్వుతాడు.

"నీకు చేతులెత్తి నమస్కరించాలి"

"కాదు. నువ్వాపని చేయవద్దు. నీవే నాకు జ్ఞానమార్గం చూపిన గురుడవు"

"కాదు కాదు-నేనే నీ శిష్యుడను"

"పెద్దవాడివి బేలవుకాకు"

"వయసు కాదయ్యా-మనిషి పెద్దరికాన్ని నిలబెట్టేది మేధస్సు"

"జ్ఞానివి"

"సరేకాని ఇంటికి వెళ్దాం పద"

"ఇదేనా నీ హితోపదేశం?"

"నా అజ్ఞానాన్ని మన్నించు. ఇంట్లో వుంటూనే యోగాన్ని అభ్యసించవచ్చు. వనాలలోనే వుండాలనేదేం లేదు"

"రాజయోగ మవలంభించమంటావా?"

"మనసు దైవ చింతలో వున్నప్పుడు మనిషి ధర్మచింతనలో వున్నప్పుడు రాజభోగాలు అనుభవించినా తప్పులేదు."

నవ్వి ఇలా చదివాడు వేమన.

"ఆశచేత నరుడు ఆయువు కలనాళ్ళు
తిరుగుచుండు భ్రమను తిప్పలేక
కుక్కవంటి ఆశ కూర్చుండ నీయదు
విశ్వదాభిరామ వినురవేమ!"

"నన్ను క్షమించు వేమన్నా-నాది తప్పే"

"తప్పు లెన్నువారు తండోప తండంబు
లుర్వి జనులకెల్ల నుండు తప్పు
తప్పు లెన్నువారు తమ తప్పులెరుగరు ॥విశ్వ॥

"ఇక ఇంతేనా?"

"పట్టు పట్టరాదు పట్టి విడువరాదు
పట్టెనేని బిగియ పట్టవలయు
పట్టు విడుచుకన్న పడిచచ్చుటే మేలు"

"ఇంత విరాగమా?"

"ఇనుము విరిగె నేని ఇనుమారు ముమ్మారు
కాచి యతుకవచ్చు గాని యెందు
మనసు విరిగె నేని మరి యతుకగరాదు"

"ఇంత యువ వయస్సులో ఈ కఠోర దీక్షను ఎలా నిర్వహిస్తావయ్యా!"

"అనగ అనగ రాగమతిశయిల్లుచునుండు
తినగ తినగ వేము తియ్యనుండు
సాధనమున పనులు సమకూరు ధరలోన"

"ఏమి కవితాధార? ఏమి భావ తీవ్రత-అయితే నేనూ నీతోనే వుంటా

.ఎకి

"వద్దు వెళ్ళిపో"

"ఏమో నాకూ సంసారం సంకటంగానే వుంది"

"చెప్పులోని రాయి చెవిలోని జోరీగ
కంటిలోని నలుసు కాలి ముల్లు
ఇంటిలోని పోరు ఇంతింత కాదయా
విశ్వదాభిరామ వినురవేమ"

"అవును నిజమే. ఇదేమిటి? ఇంత ధారాళంగా పద్యాలు వస్తున్నాయే. ఇన్నాళ్ళు ఎప్పుడయినా కవితా సాధన చేశావా?"

నవ్వాడు వేమన.

"పూర్వపుణ్య పరిపాకంవల్ల లభించేవికదా-

కవితా వనితా"

విరగబడి నవ్వాడు వేమన.

"ఇక్కడే వుంటావుకదా?"

"ఎక్కడున్నా నీకు నేను ప్రక్కనేగా. తప్పక కనిపిస్తాను"

"నన్ను మరచిపోకు సుమా"

"నన్ను మరచిపోతేకదా"

"వస్తా"

"సంతోషం"

మాటికి తిరిగిచూస్తూ అభిరామయ్య వెళ్ళిపోయాడు.

# యోగిగా వేమన

ఇక వేమన ఇంటికి వెళ్ళలేదు. ఎక్కడెక్కడ తిరిగాడో. ఎవరయినా దయతలచి ఏదయినా ఇస్తే తింటాడు-లేదా పస్తుంటాడు. అటు పారమార్థికుడు కాడు, ఇటు లౌకికుడూకాడు. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ వుంటాడు. తనలో తానే ఏదో గొణుక్కుంటాడు. చెడు కనిపిస్తే భావావేశానికి లోనవుతాడు. మంచి కనిపించితే ఆనందిస్తాడు. ఆయా సందర్భాల్లో చెప్పినవే ఆయన పద్యాలన్నీను.

"భూమి నాది యన్న భూమి ఫక్కున నవ్వు
ధనము నాది యన్న ధనము నవ్వు
కదన భీతు జూచి కాలుండు నవ్వురా
విశ్వదాభిరామ వినురవేమ"

అదీ ధోరణి. నిరంతరం సత్యాన్వేషణ. నీతి తత్త్వ బోధన. ఆహార పానీయాలమీద ధ్యాస లేదు వివనికి వస్త్రాలమీద శ్రద్ధలేదు. చినికి పాతలయినా జారిపోయినా లెక్కలేదు. అది చూసి ఇదేమిటన్నవారికిది జవాబు-

తల్లి గర్భమునుండి తా బుట్టినప్పుడు
మొదలు బట్టలేదు తుదను లేదు
నడుమ బట్ట గట్ట నగుబాటు కాదొకో ॥విశ్వ॥

కట్టు బొట్టు అన్నీ వదిలేసి కౌపీనధారి అయ్యాడు-
ఏమిటిది? అన్నట్టి ఆచారవంతులకు ఇలా అనేవాడు.

వేష భాష లెరిగి కాషాయ వస్త్రాలు
కట్టగానె ముక్తి కలుగబోదు
తలలు బోడులయిన తలపులు బోడులా ॥విశ్వ॥

దైవపూజను నిందించకు మన్నవారిని-

గట్టు రాళ్ళు తెచ్చి కాళ్ళచేతుల తొక్కి-
కాసె ఉలులచేత చేసె రూపు
మొరపురాళ్ళ కెరగు మొప్పెలకే మందు.

మంత్ర మహిమను కాదంటావా? అంటే-

విప్రులెల్ల చేరి వెర్రికూతలు కూసి
సతిపతులను గూర్చి సంబరముగ
మును ముహూర్త ముంచ ముండెట్లు మోసెరా-

యోగ విద్యను మెచ్చుకునేవారికి—

ఆసనమ్ము పన్ని అంగమ్ము బిగియించి
మొదలు విరుచుకొనెడి యోగమెల్ల
తెట్టి సాముకన్న చింతాకు తక్కువ-

ఎవరినైనా మునుల ఆశ్రయించాలంటే—

గుహలలోన జొచ్చి గురువుల వెదకంగ
క్రూర మృగమొకండు తారసిలిన
ముక్తిమార్గమదియె చూపించు ముందుగా
విశ్వదాభిరామ వినురవేమ.

తీర్థాటనం చేయుమన్నవారిని-

తనువులోన నున్న తత్త్వంబు దెలియక
వేరె యాత్ర బోవు వెర్రివాడు
గంత మోసి మోసి గాడిద తిరుగదా-

మరి ఏం చేయాలీ అంటే—

తనువు నడవి జేసి తనలోనె కూర్చుండి
తపము జేయలేని తపసులెల్ల
అడవి యందుజేరి అలజడి పొందేరు
విశ్వదాభిరామ వినురవేమ॥

అని అనేవాడు.

గుంటూరు ఆ చుట్టుప్రక్కల ప్రదేశాల్లో జిల్లాల్లో ఆయన తిరుగని గ్రామంలేదు. ఏదేని సంఘటనను చూసినప్పుడు ఆయన నోటివెంట ఓ పద్యం వెంటనే వెలువదేది. ఆ వెనువెంటనే అది జనం నోళ్ళలోబడి నాలుకలపై నాట్యమాడేది-దేశాన వ్యాప్తి అయ్యేది.



అనేక సాంఘిక నిబంధనలు తప్పు అని మనసులో వున్నా పైకి అన డానికి ధైర్యం చాలని ఆలోచనాపరులకు వేమనకవి వరప్రసాదమైనాడు. ఆ పద్యాలు చదువుతూ సమాజంలోని చెడును నిరసిస్తూ, కుళ్ళుబోతులను వెక్కిరిస్తూ తృప్తిపడేవారు.

లోభిని చూసి—

పెట్టి పోయలేని వట్టి నరులు భూమి
పుట్టనేమివారు గిట్టనేమి?
పుట్టలోన చెదలు పుట్టదా గిట్టదా-

దొంగ భక్తులను చూసి—

ఆత్మ శుద్ధిలేని ఆచార మది యేల
భాండ శుద్ధిలేని పాకమేల
చిత్తశుద్ధిలేని శివపూజలేలరా-

అంటు ముట్టులనేవాళ్ళను జూచి—

మాలవానినేల మరి మరి నిందింప
ఒడలనున్న జీవుడొకడుకాదె,
వానిలోన నున్న వాని కులంబేమి-

కులమతాలు గొప్పలు పలికేవారికి—

కులము హెచ్చు తగ్గు గొడవల పనిలేదు
సానుజాతమయ్యె సకల కులము
హెచ్చుతగ్గుమాట లెల్లెరుంగగవచ్చు॥

దారిద్ర్యాన్ని గూర్చి—

ధనములేమి యనెడు దావానలంబది
తన్ను చెరచు మీది దాపు చెరచు
ధనములేమి జూడ, దలపనే పాపంబు-

విద్యావంతుల దైన్యాన్ని గూర్చి—

గ్రాసమింతలేక కడు కష్టపడుచున్న

విద్య యేల నిలుచు, వెడలుగాక
పచ్చికుండ నీళ్ళు పట్టిన నిలుచునా?-

ఇలా స్వీయనీతిబోధ చేసేవాడు—

అన్ని దానములకు అన్నదానమె మిన్న
కన్నవారికంటె ఘనులు వేరు
ఎన్న గురునకంటె ఎక్కువ లేదయా
విశ్వదాభిరామ వినురవేమ.

ఉశతప్ప ఆదర్శంలేని అల్పకవుల గురించి—

తోటకూరకైన దొగ్గలికైనను
తమిద కుదుముకైన తవిటికైన
కావ్యములను చెప్పు గండ్యాలు ఘనమైరి
విశ్వదాభిరామ వినురవేమ.

## అన్న వచ్చినా వెళ్ళలేదు

అభిరామయ్యతో విషయం తెల్పి రాచవేమన్న సోదరుని కోసం ఆయనక్కడలేదు. ఆ చుట్టుపక్కల వెదికినా కనిపించలేదు. ఎక్కడా ని వుండేవాడు కాడాయన.

అతని జాడలో వెదకుతూ తిరిగాడు. మొన్న ఆ ఊరిలో క

డంటే నిన్న ఈ ఊరిలో ఉన్నాడనేవారు. ఈరోజు ఎక్కడున్నాడనే కష్టమయింది.

కొండంత ఆశతో భర్త రాకకోసం ఎరిక్షిస్తూ ద్వారం నరసమాంబ. అన్నదమ్ములిద్దరూ కల్సివస్తున్నట్లు పగటికలలు కని వస్తున్న పెనిమిటిని చూసి నిరాశపడేది. ఆయన ముఖాన్ని చూసి విషయాన్ని గ్రహించి వ్యధచెందేది. మూగగా రోదించేది.

చివరికి రాచవేమన తమ్ముని చూశాడోచోట చూడకమ విన్నాడు. కాని చూసింతర్వాత ఆతనికి దుఃఖమాగలేదు.

వేమన తల చెదరివుంది. గడ్డం పెరిగివుంది. నామ మా చెంత కౌపీనం వుంది. పిచ్చివానివలె కన్పిస్తున్నాడు. జాలిగా చూ నవ్వుతాడు. ఆవేశంతో మాట్లాడుతాడు.

ఒక కాలు చాపి ఒక కాలు మోకాలు వంచి హుస్సుని నలో మునిగి వున్నాడు. (అది తంజావూరులో ఉన్న ఏకైక కుడ్య ఆకారం)

తమ్ముని పలకరించాడు అన్న. ఏడ్చాడు. వెంటరమ్మన మాట్లాడాడు నవ్వాడు రానన్నాడు.

తండ్రిగారి సాంవత్సరీక (శ్రాద్ధ) కర్మకయినా రమ్మన

తమ్ముడు నవ్వుతూ ఇలా అన్నాడు

పిండములను చేసి పితరుల తలపోసి



కాకులకును పెట్టగా తగునటె
పితిరి గద్దలు పెద్ద లెట్లాయెరా-॥విశ్వ॥

తమ్ముని ధోరణికి విస్తుపోయాడు. బాధపడ్డాడు. అతనలా మారటానికి తన తప్పేమైనా వుందేమోనని విచారించాడు. వదిన బెంగతో ఎదురుచూస్తూ వుందన్నా ఆయన చలించలేదు.

నువ్వు రాకుంటే నేనూ వెళ్ళనని-అన్న పంతంపట్టాడు.

అలావద్దు-అని వేమన్న ఈ పద్యం చెప్పాడు.

సుగుణవంతురాలు సుదతియై యుండగ
బుద్ధిమంతులగుచు పుత్రులొప్ప
స్వర్గమేటికయ్య సంసారి కింకను-

ఆస్తిని పంచుకొని నీ భాగంతో నువ్వు స్వేచ్ఛగా వుండు. నిన్ను నేనేమీ అననిక అంటే-వివారంతో అన్నాడిలా.

ఆలిమాటలు నమ్మి అన్నదమ్ములరోసి
వేరు పోవువాడు వెర్రివాడు
కుక్కతోక పట్టి గోదావరీదనా.

ఆయన ఏది చెప్పినా లోకాన్ని దృష్టిలో పెట్టుకొని చెప్పినవే. నేనొక్కన్ని ఎలా ఉండేదిరా. నీతో వంశాభివృద్ధి అవుతుందని భావించాను-అంటే అన్నాడిలా వేమన.

కులములోన ఒకడు గుణవంతుడుండెనా
కులము వెలయు వాని గుణము వలన
వెలయు వనములోన మలయజంబున్నట్లు.

నామీద నీకు కోపం పోలేదు అని వాపోయాడు అన్న.

కోపమునను ఘనత కొంచెమైపోవును
కోపమునను మిగుల గోడు చెందు

కోపముడిపె నేను కోరిక లీడేరు
విశ్వదాభిరామ వినురవేమ.

అని సంజాయిషీ ఇచ్చుకున్నాడు వేమన్న.

ఇక నేను వెళ్తా ఖాయంగా కవిరాజు రావవేమన్న. మౌనంగా అటు వైపు చూసి సాలోచనగా తలవంచుకొని తన ధ్యానంలో లీనమైనాడు వేమన.

## ఇప్పటి సిద్ధాంతాలకు అప్పుడే పునాదులు

అహింసకు పట్టం-

పంచమ నిగమంబు భారతంబగునని
పొగడిరేల జనులు బుద్ధిలేక?
హింస కార్యము తమకిష్టమెట్లాయెరా?
విశ్వదాభిరామ వినురవేమ.

ఈ లోకమునందలి సుఖమే సత్యమనుట-

ఇహమునందు సుఖములీడేరగాలేదు
పరము నమ్మెనేని బ్రతుక నగునె?
మొదలులేని సుఖము తుదకెట్లు కలుగురా.

పరిపాలకులను నమ్మరాదనుట-

ఎంత సేవచేసి ఏపాటు పడినను

పాలకులను నమ్మరాదు రన్న,
పాముతోడి పొత్తు పదివేలకైనను!

ధర్మం-సమతకోసం పోరాటం తప్పదు-

ఇరుగు పొరుగువారికెనయ సంపదచూసి
తమకు లేదటన్న ధర్మమేమి?
ధర్మమన్న తొల్లి తన్నుక చచ్చిరి.

సహపంక్తి భోజనాలకు-కులనిర్మూలనకోసం-

ఉర్వీజనులకెల్ల ఒక్క కంచముబెట్టి
పొత్తు గుడిపి కులము పొలియజేసి
తలను చెయ్యిబెట్టి తగనమ్మజెప్పరా.

చేసే పనినిబట్టి ఫలితముంటుందనుట-

వ్రాతకంటె హెచ్చు వరమీదు దైవంబు,
చేతకంటె హెచ్చు వ్రాతలేదు,
వ్రాత కజుడు కర్త, చేతకు తాకర్త.

ధర్మమే దైవం-

వెలయ భూమి తల్లి—విత్తనమటు తండ్రి
పంటలరయ సుతులు పాడి పరము

ధర్మంబు తనపాలిదైవంబు తలపగా
విశ్వదాభిరామ వినురవేమ.

ఇంతకంటె ప్రగతిశీలి-మేధావి కవి వేరే ఎలా వుంటాడు. ఇప్పటికి మూడు నాలుగువందల యేండ్లక్రితమే అంతటి ఉన్నతమయిన భావుకుడు వేమన.



# పురాణ పురుషుల వెక్కిరింత

పాలసాగరమున పవ్వళించిన సామి
గొల్ల ఇండ్ల పాలు గోరనేల?
ఎదుటివారి సొమ్ము ఎల్లవారికి తీపి
విశ్వదాభిరామ వినురవేమ.

అగ్నిబాణముచేత అంబుధింకి నపుడె
రాముడవలికేగ లావు మరచి
వరుస కొండలు మోపి వారధేలను గట్టె-
కనక మృగము భువిని కలదు లేదనడయ్యె.
రాముడంత వెర్రి రాజు గలడె?
తెలివిలేనివాడు దేవుడెట్లాయెరా-
పడతి మోపె నొకడు పడతి మేసెనొకడు
పడతి నెదనుబెట్టి బ్రతికె నొకడు
పడతికొరకు నిట్లు పలుపాట్లు పడిరయా-
ఉదధిలోని నీరు ఉప్పులుగా జేసె
పసిడి గలుగువాని పిసినిజేసె
బ్రహ్మదేవు చేత పాడైన చేతరా
విశ్వదాభిరామ వినురవేమ.

ఇలా పురాణ గాథలను-విగ్రహారాధనలను వెక్కిరించి "సత్యార్థ ప్రకాశిక" రచించిన శ్రీదయానంద సరస్వతికి వేమన మార్గదర్శి అనుకోవచ్చు. ఇంకా ఆయన మెచ్చిన వేద ధర్మాలను, వైదిక క్రతువులను కూడా వేమన మెచ్చ లేదు. క్షుద్రదేవతా రాధనలూ లేవు.

ఒక్క ప్రొద్దులుండి ఒగినీళ్ళలో మున్గి
కూడు వండి వేల్పు కుడువు మనుచు
దాని నోరుకొట్టి తామె తిందురు కదా
విశ్వదాభిరామ వినురవేమ-

రాతిబొమ్మకేల రంగైన వలువలు
గుళ్ళు గోపురములు కుంభములును
కూడు గుడ్డ తాను కోరునా దేవుడు-

బ్రతుకు తెరువులేని బడుగువాండ్రందరు
యోగివరుల మంచు సాగి రాగ
బండవాండ్రు ముందు దండంబు లిడుదురు-

జీవి పోకముందె జీవ వస్తువులిచ్చి
జీవి నిలుప వలయు జీవనముగ
జీవి తొలగు వెనుక జీవ వస్తు వులేల-

కడుపు బోరగించి కన్నులు ముకుళించి
బిర్ర బిగుసుకొన్న బీద యోగి
యముని బారి గొర్రె యత్రదేమి చేయును-

అక్షమాలబట్టి యలసట జెందక
కుక్షి నింపుకొనుట కొదువ కాదు
పక్షికొంగరీతి పైచూపులేలకో
విశ్వదాభిరామ వినురవేమ—

ధాంబికాచారాలకు, మూఢవిశ్వాసాలకు వ్యతిరేకి. వేమనది జ్ఞానయోగం యథార్థవాదం.

వేమన్నది మానవతా వాదం. కులమతాలు నచ్చవు. జంగాల, వైష్ణవుల బ్రాహ్మణుల, విగ్రహారాధకుల, యజ్ఞయాగాల, స్వర్గ నరకాల, మంత్ర తంత్రాల జ్యోతిష్యముహూర్తాల, ఉపవాసవ్రతాల-అపహాస్యం చేసాడు తన పద్యాల్లో. తాను నమ్మిన వేదాంతాన్ని ఇలా నిశ్చయంగా, నిర్భయంగా చాటిచెప్పాడు.

ఆత్మబుద్ధివలన అఖిలంబు తానయ్యే
జీవబుద్ధివలన జీవుడయ్యే
మోహబుద్ధిలయము ముందర కనుగొను
విశ్వదాభిరామ వినురవేమ-

ఇంటిలోన జ్యోతి యెంతయువెలుగగా
పొరుగువారి అగ్గికరుగ నేల?
తాను దైవమాయె దైవము కొలుచురా?-
గాజు కుప్పెలోన కడగుచు దీపంబు
ఎట్టులుండు జ్ఞాన మట్టులుండు
తెలిసినట్టివారి దేహంబులందున-

తానె తత్త్వమగుట తన్నెరుంగగలేక
మాయ తత్వ మనుచు మరుగుచుండు
ధర్మకర్మములకు తగరోయ తత్వమౌ-

పసుల వన్నెవేరు పాలేక వర్ణమౌ
పుష్పజాతివేరు పూజలొకటె
దర్శనములువేరు ధర్మంబు ఒక్కటే-

వేద విద్యలెల్ల వేశ్యల వంటివి
భ్రమలపెట్టి తేటపడగ నీవు
గుప్తవిద్య యొకటె కులకాంత వంటిది-

తల్లి నెరుగువాడు దైవంబు నెరుగును
మన్ను నెరుగువాడు మిన్ను నెరుగు
మన్ను మిన్నెరిగిన తన్ను తానెరుగును-

మనసు నిర్మలుడయి మంచి నీతులు దెలిపి
భయములెల్లదీర్చి భద్ర మగుచు
తావు చేర్చువాడె తారక బ్రహ్మంబు-

చదువులందు, పాడిమొదవులందును, స్త్రీల
పెదవులందు, రాజ్య పదవులందు,
ఆశలుడిగి నట్టి అయ్యలు ముక్తులు:
విశ్వదాభిరామ వినురవేమ-

# దేవదాసి రాక

మబ్బుతో కప్పబడిన చంద్రబింబంవలె అందాల మోముపై మేలి ముసుగు ధరించుకొని దేవదాసి ఒకనాడు వేమనను వెదకుతూ వచ్చింది. ఆయన పాదాలపై తలవాల్చి కూర్చుంది. నిప్పుకాలినప్పటివలె వేమన తన పాదాలను వెనుకకు లాగుకున్నాడు.

"ఎవరు?" అన్నాడు.

ఆమె అలాగే వుంది.



అంతలోకే ఆమె చెల్లెలు మందినుంచి త్రోసుకొని ముందుకు వచ్చింది ఆమెను చూసి చరణాలవద్ద పడి వున్నదెవరో గ్రహించగలిగాడు.

"లే-సరిగా కూర్చో" అన్నాడు వేమన.

లేచి కూర్చున్నదికాని ఆమె యేడుస్తున్నది.

అతడు నవ్వాడు.

"ఈ దాసిని మరచిపోతిరా స్వామీ" అంది.

"ఊహూ, ఆటవెలది నా వెంటనంటే వుంటుంది నీడలా" అన్నాడు-ఆ తర్వాత మెల్లగా తనలో ఇలా అనుకున్నాడు.

"ఆడదానిజూడ నర్థంబు జూడగా
బ్రహ్మకైన బుట్టు రిమ్మ తెగులు
బ్రహ్మ యాలిత్రాడు బండిరేవున దెంప
విశ్వదాభిరామ వినుర వేమ."

ఆయన ఈ మాటలలో ఆమెకు ఆశ చిగురించింది.

"ఏమిదశ మీకిది? ఏం తక్కువయిందని?" అంది.

"ఇప్పుడేం తక్కువుందని?" నిశ్చలంగా, తృప్తిగా అన్నాడు.

"ఈ గోచిపాత, ధూళినిండిన శరీరం, సంస్కారంలేని తల గడ్డం; ఏమిటి స్వామీ ఇది?" బాధగా అడిగింది.

"దేహమనెడి ఇల్లు దినదినంబును నూడ్చి
యలికి పూసి మెత్తి యనుదినంబు
కడకు వీడిపోవు కపటిరా జీవుండు—"

"రండి స్వామీ! నా సంపదంతా మీది"

"కుడువ ముడువలేక కూడబెట్టగలేక
విడువ నుడువలేక విద్యలేక
నడవ నేరని వాని నడపినుగందురు—"

"నాకు మీరంటె పంచప్రాణాలు. ఏనాడూ మీ మనసు నొప్పించనని నిందింపనని ఒట్టుపెట్టుకుంటున్నాను"

"ఆపదకలవేళ అరసి బంధుల చూడు
భయమువేళ జూడు బంటుతనము
పేదవేళ చూడు పెండ్లాము గుణమెల్ల
విశ్వదాభిరామ వినురవేమ"

"నిజం స్వామీ, నన్ను నమ్మండి. నాతోరండి. మిమ్ము పువ్వుల్లోపెట్టి పూజిస్తాను"

"భార్యమీద ఆశ పరగ పురుషునకుండు
మగనిమీద ఆశ మగువకుండు
శివునిమీద ఆశ సిద్ధున కుండురా
విశ్వదాభిరామ వినురవేమ."

"మిమ్మే నమ్ముకొనివున్న పాదదాసిపై దయలేదా స్వామీ మీకు?"

"అంగమెల్ల వణికి యటు దంతములువీడి
తనువు ముదిమచేత తప్పియున్న
ముప్పు తిప్పలైన మోహంబు వీడరు
విశ్వదాభిరామ వినురవేమ"

ఆమె విచారగ్రస్థురాలై 'ఇక నాకు మరణమే శరణ్యం' అంది.

"జీవి జీవి జంప శివుని జంపుటె యగు
జీవుడరసి తెలియ శివుడు కాడె
భావమందు వేగపరికించి చూడుమా?"

అని ఆత్మహత్యను నిరసించాడు వేమన.

"బతికి ఏం చేయమంటారు నన్నింకా"

"లోకంలో దుఃఖంతో వున్నవారికి సాయం చేయాలమ్మా."

"ఏమిగొంచువచ్చె తానేమి గొనిపోవు
పుట్టువేళ నరుడు గిట్టువేళ
తాను ఇచ్చు ఈవె తనవెంట వచ్చును"

ఆమె విచారంతో వెళ్ళిపోయింది.

సంసారాన్ని వదలినా సంసార జీవితాన్ని వద్దనలేదు వేమన. చక్కని కుటుంబ జీవితాన్ని మెచ్చుకున్నాడిలా-

తల్లిదండ్రి యన్నదమ్మ లాత్మసఖులు
ఎలమి బంధు భృత్యులెల్ల జనము
కలిగి వర్ధిలంగ ఘనతతోనుండరా
విశ్వదాభిరామ వినురవేమ

## దేశ సంచారం

వేమన ఎన్నో ఊళ్ళు తిరిగాడు. ఎక్కడికి వెళ్ళినా అక్కడ తన కవిత ప్రవహిస్తూనే ఉండేది. అది జీవనదీధార.

ఆరదు ఆగదు. నిరంతరం ప్రోసుకువెళ్ళడమే దాని స్వభావం. సమాజం దానికి ప్రేరణ. సత్యం గమ్యం. నీతి బోధ ప్రధానం.

వెళ్ళినచోటనల్లా ఈయన వెక్కిరింతలు తప్పవు. కొందరికి ఉలుకు పాటు ఉద్రేకం తప్పవు. మాటలతో చేతలతో ఆయనను హింసింప జూసేవారు. కాని వేమన గుండెబలం. కండబలం కలవాడు. ఆయన చూపు చాలు శత్రువులను ఆమడదూరంలో నిలిపి ఉంచడానికి. పైగా ఆయన సత్యాన్వేషి.

'యదార్థవాది నశ్శత్రుః లోకధర్మస్సనాతనః'—మానవగీత.

(నిజం పలికేవారికి శత్రువులుండడం పూర్వంనుంచీ వుంది.)

అయినా వేమన భయమేమిటో ఎరుగడు. సమాజంలోని కుళ్ళును, మోసగాళ్ళను వేలెత్తి చూపాడు.

తస్మాత్ జాగ్రత్త—అని గొంతెత్తి జనాన్ని హెచ్చరించాడు.



సంసారంలేదు. స్వార్థంలేదు. సంభావన లాశించలేదు. పూజల కంగీక రించలేదు. మంత్ర గోపనమూ లేదు. శిష్య బలగమూ లేదు. యెవరెవరో వారి దర్శనార్థం వచ్చేవారు. పండ్లో తిండ్లో తోచింది తెచ్చి ఇచ్చేవారు-డబ్బు మాత్రం కాదులెండి. ఆయన పుచ్చుకోడు. దాని అవసరము లేదు-ఆశాలేదు.

ఆయన సందర్భాన్నిబట్టి చెప్పిన పద్యాలు, లేదా శిష్యులు చదివినవి విని తనివిజెంది నమస్కరించి తృప్తితో వెళ్ళేవారు-చూడవచ్చినవారు.

శిష్యులంటూ యెవరినీ ప్రత్యేకంగా వేమన చేరదీయకున్నా కొందరు అభిమానంతో ఆయన వెంటవుండేవారు. నచ్చినంతకాలం వుండీ ఇంటి ధ్యాస మళ్ళి నప్పుడు వెళ్ళిపోయేవారు. అందుకు వేమన అభ్యంతరం చెప్పేవాడుకాదు.

అభిరామయ్య వేమనకు ప్రధాన శిష్యుడని చెప్పుకుంటారు. ఆయన యెప్పుడు వచ్చిచేరిందీ యెంతకాలం గురువుతో ఉన్నదీ సరిగా తెలియదు.

వేమన నిందకు ప్రధానకారణం కులమతాల నింద. పైగా విగ్రహారాధనను నిరసించడం.

వైదికాన్ని చార్వాకం, జైనం, బౌద్ధం, వీరశైవం వంటి భారత మాతాలు కాదన్నా జనంలో దాని ఆదరణా వుంది. పురాణ ధర్మాల—దేవతలపై భక్తివిశ్వాసాలే కాక వాటినే జీవనోపాధిగా చేసుకొని బ్రతికే వర్గముంది. వారికి వేమనపై కోపం జాస్తి. అది తప్పదుకూడా. ఎక్కడ కొట్టినా భరిస్తారేమోకాని పొట్టమీదకొడితే ఎవరు సహిస్తారు. అందుకే వేమనను గట్టిగా ఎదిరించారనుకో వచ్చు. అందుకే కాబోలు ఆ ప్రజాకవి అగ్రజన్మల అభిజాత్యాన్ని సవాలుచేస్తూ ఇలా పద్యాలు చెప్పాడు.

కులము చేతబట్టి గుంపించనేటికి
పాదు ఉన్నచోట ప్రబలు విత్తు
ఏటికులమదింక ఎక్కడి ద్విజుడయా?
విశ్వదాభిరామ వినురవేమ.

గుడులు దేవతలని గుర్తులు కావింత్రు
ముష్టిబాపలనుచు మూర్ఖనేల?
మొప్పెలకును దారి చెప్పగా ప్రాజ్ఞత-
అలిరంకు దెలుప నఖిల యజ్ఞాంబులు

తల్లి రంకు దెలుప తద్దినాలు
కాని తెరువు కర్మకాండ కల్పితమాయె-

తల్లి గన్న తల్లి తన తల్లి పినతల్లి
తండ్రి గన్నతల్లి తాత తల్లి
యెల్ల శూద్రులైరి యేటి బాపడుతాను
విశ్వదాభిరామ వినురవేమ.

స్త్రీలకు ఉపనయనం లేదుకాబట్టి శూద్రులనుట, ఆయనది కేవలం కుల ద్వేషమా అంటే కాదనడానికి ఈ క్రింది పద్యం సాక్షి.

బ్రాహ్మణులకు సర్వధనముల నీవచ్చు
గౌరవింపవచ్చు కోరి వారు
జ్ఞానమొసగి జనుల కడదేర్చుచుండిన,
విశ్వదాభిరామ వినురవేమ.

వేమన గుణ పక్షపాతి!

# వేమన బలపరచిన ధర్మాలు

తనకంటె ముందు వెనుక ప్రముఖ వ్యాప్తిలో వున్న యెన్నో ధర్మాలు వేమన కవితలో కానవస్తాయి.

సత్యమేవ జయతే—

మాటలెల్ల కల్ల మనసెల్ల కల్లయై



ఏటి ప్రాణమింక నేటి బ్రతుకు
మాట సత్యమైన మరి శతాయుశ్యంబు
విశ్వదాభిరామ వినుర వేమ.

జాతస్య మరణం ధృవం—

మరణమన్న వెరచి మది గలంగగనేల

నిరుడు ముందటేడు నిన్న మొన్న
తనువు వీడినతడు తనకన్న తక్కువా?

నీచ ప్రవృత్తి—

హీనుడెన్ని విద్యలిల నభ్యసించిన
ఘనుడు కాడు హీన జనుడె కాని
పరిమళముల గార్దభము మోయ ఘనమౌనె-

అజ్ఞాని—

ఎరుకమాలి వాడు ఏమేమి చదివిన
చదివి నంతసేపు సద్గుణియగు
కదిసి తామరందు కప్పగూర్చున్నట్లు-

అరిషడ్వర్గాలనింద—

మోహలోభములను మొనయుట కడు కీడు
మోహముడిగెనేని ముక్తుడగును
లోభముడిగె నేని లోకంబు నెరుగును-

లోభి నింద—

లోభి వాని జంప లోకంబు లోపల
మందు వలదు వేరు మతము వలదు
పైక మడిగినంత భగ్గున పడి చచ్చు-

రుణము కూడదనుట—

పరుల మోసపుచ్చి పర ధన మాశించి
కడుపు నింపుకొనుట కాని వద్దు
రుణము చేయు మనుజు డెక్కువ కెక్కునా ?
అప్పు తీయరోత హరి హరాదులకైన
మొప్పెతోడ మైత్రి మొదలె రోత
తప్పు బలుక రోత తాకట్టు కడురోత -

విసా ధనం నశోభంతే—

తల్లిబిడ్డలకును తగవులు బుట్టించు
ధనము సుఖము గూర్చదని వచింత్రు
కాని గడనలేక గడుచుట యెట్లురా -

ఆకలిబాధ—

పులి యదెట్టి దన్న భూలోక మృగరాజు
కలి యదెట్టి దన్న కానరాదు
పులియు కలియు కన్న భువి నాకలియె హెచ్చు -

ఐకమత్యమే మహాబలం—

ఐకమత్య మొక్కటావశ్యకంబెప్డు
దాని బలిమి నెంత యేని కూడు
గడ్డి వెంటిబెట్టి కట్టదా ఏనుంగు -

సహజీవనం—

ఇచ్చి పుచ్చుకొన్న హితులును మనుమలు

తగ్గులేక ఇల్లు తామరపలె
కాచి పూచి పండి కడు రమ్యమైయుండు-

పనివిలువ—

భూమిలోన బుట్టు భూసారమెల్లను
తనువులోన బుట్టు తత్త్వమెల్ల
శ్రమములోన బుట్టు సర్వంబు తానౌను-

వ్యభిచార నింద—

ఇంటి యాలి విడిచి ఇలజార కాంతల
వెంట దిరుగువాడు వెఱ్ఱివాడు
పంటచేను విడిచి పరిగె లేరిన యట్లు-

కన్యాదానం—

కలిమి జూచి యివ్వ క్రయమిచ్చినట్లుండు
సముననకివ్వ మంచి సరస గుణము
పేద కివ్వ మనువు పెనవేసి నట్లుండు-

గృహస్థు ధర్మం—

పోల్కి జూచి తెలివి పూర్వాపరంబులు
తడుపు గుడుపు నడుపు తత్త్వమెరిగి
నడవ నేర్చినట్టి నరుడు గృహస్తుండు
విశ్వదాభిరామ వినురవేమ.

# వేమన కవితాసారం…

వేమన భావాలు పండితమ్మన్యులకు, మత ఛాందసులకు, దుష్టపాలకు
కు, దోపిడీ దొంగలకు తలకంటకంగా ఉండేవి. కాని, సామాన్య జనానికి అవే
విత్ర మంత్రాలు, శిరోధార్యాలు.

ఏ ప్రభుత్వాలు కాదు, పండిత పరిషత్తులు కాదు, సామాన్య ప్రజలే



వారి పద్యరత్నాలను తాళపత్ర గ్రంథాల్లో వ్రాసి అమూల్యంగా భద్రపరచుకొన్నారు. ఈ తరానికి తరగని నిధిగా అందించారు.

వేదాంత భావాలను పట్టిచూస్తే అద్వైత ప్రభావం, విగ్రహారాధన వ్యతిరేకత, కులమతాల విముఖత ఆయన కవితల్లో వుంది.

వేమన మానవతావాది.

ఆయన ఆరాధించిన శివుడు—జీవుడు. పేర్కొన్న యముడు మృత్యువు పరానికంటె ప్రస్తుతానికే విలువిచ్చాడు విశ్వసించాడు.

కాలానికి ముందున్నవాడే క్రాంత దర్శి. వేమన నిజమయిన ప్రజా కవి. ఆకలిని నిరసించి "సర్వేజనాః సుఖినో భవంతు" అనే ఆదర్శ సిద్ధాంత ప్రవర్తకుడు.

దైవానికి మించి ధర్మానికి విలువిచ్చాడు. విధి వ్రాతను కాదని స్వయం కృతానికి పట్టం కట్టాడు.

మంచియున్నది మాలయైతే-మాలనేయౌదున్, అనిన గురజాడ మహాకవి కంటె కొన్ని వందలేండ్లకు పూర్వమే మాలలను ఇతర మానవులతో సమానమన్నాడు.

గాంధీజీది దైవభక్తి ప్రేరితమయిన హరిజనోద్యమం. కాని మన వేమనది కులమతాలులేని నవ్యమానవతావాదం. కాలం దినదినం దిగజారిపోతున్నదా అనిపించుతుంది. ఇప్పటికీ మన సమాజంలో స్వార్థ సంకుచిత భావాలు వుండడం శోచనీయం.

ఈ కాలంలో కొందరు దొంగసాధులు గుర్రపుస్వారితో పగటి దివిటీలు, బాజాలతో వేమన శిష్యులమని సంచారంచేస్తూ ప్రజల్ని దోపిడీచేస్తూ కనిపించడం మనజాతి దౌర్భాగ్యానికి చిహ్నం.

ఆంధ్ర కవుల్లో నవీనుల సంగతి వదిలితే ప్రాచీనుల్లో ఇంతటి ప్రగతిశీలియైన ప్రజాకవి కాగడాలతో వెదకినా మరొకరు కనిపించరనుట అతిశయోక్తి కాదు.

భాషావ్యాకరణ దోషాలు ఏవైనా వుంటే అవి ఆయన భావసంపత్తి ముందు లెక్కలోనికిరావు. ఈనాడు సాగిస్తున్న వ్యావహారిక భాషా ఉద్యమానికి ఆయనే ఆద్యుడనొచ్చు! ఆ భావాల వెగటువల్లనే వేమనను శిష్టకవుల పంక్తికి రానీకుండా మనవాళ్ళు గట్టిప్రయత్నం చేశారు. అందుకేనేమో కవి వేమనను,యోగి వేమనగా ప్రచారం చేశారు. యోగానికి ఆ కవి పెద్దపీటను వేయలేదు, పైగా వెక్కిరించాడుకూడా. జనం వేమనను మరచిపోలేరు కనుక కవి పేరునయినా మరిపించాలని చూశారు. హిందూ మతాన్ని నిరసించిన గౌతమబుద్ధుని విష్ణుమూర్తి దశవతారాల్లో ఒకనిగా మార్చిన ఘనులుకదా మన పూర్వులు. అయినా సూర్యకాంతికి అరచేతిని అడ్డుపెట్టి ఆపగలరా? అది వారికి సాధ్యం కాలేదు.

వేమారెడ్డి తన పేరును వేమనగా చెప్పుకోవడమే ఒక విశేషం. కావాలనుకుంటే రెడ్డి శబ్దాన్ని తన పద్య మకుటంలో ప్రయోగించేవాడే.

అసలు సిసలయిన అచ్చపు ఆంధ్ర కవి వేమన, అజరామర కవితను మనకు అందించినందులకు కృతజ్ఞతాపూర్వక అంజలి అర్పించుకుందాం.

తన సాహిత్యంతో జనం గుండెల్లో గూడుకట్టుకొని, నాలుకలపై ఆట వెలదిని నాట్యమాడించి, గుండె బలం ఆదర్శం పెంచిన ఈ మహాకవి తన వార్ధక్య దశలో కీర్తిశేషులైనారు. కడప [అనంతపురం] జిల్లాలోని కటారుపల్లెలో వేమన సమాధిని భక్తిశ్రద్ధలతో జనం పూజిస్తున్నారు.

**వేమన జన్మ ధన్యం-ఆయన పద్యాలు మాన్యం.**

# వేమన నీతి పద్యాలు

పట్టనేర్పుపాము పడగ నోరగజేయు
చెరప జూచువాడు చెలిమిచేయు
చంపదలచురాజు చనువిచ్చుచుండురా
విశ్వదాభిరామ వినురవేమ.

కోతి బట్టి తెచ్చి కొత్త పట్టముగట్టి
కొండముచ్చులెల్ల కొలచినట్లు
నీతిహీనునొద్ద నిర్భాగ్యులుందురు.

మేడిపండు జూడ మేలిమైయుండును
పొట్టవిచ్చి చూడ పురుగులుండు
పిరికివాని మదిని బింకమీలాగురా-

పదుగురాడు మాట పాడియై ధరచెల్లి
ఒక్కడాడుమాట యెక్కదెందు
ఊరకుండు వాని నూరెల్లనోపదు-

తల్లిదండ్రి మీద దయలేని పుత్రుండు
పుట్టనేమి వాడు గిట్టనేమి
పుట్టలోన చెదలు పుట్టదా గిట్టదా ?-

చిత్తశుద్ధిచేత చేసిన పుణ్యంబు
కొంచెమైన నదియు కొదువ కాదు
విత్తనంబు మఱ్ఱి వృక్షంబునకు నెంత ?-

చంపదగిన యట్టి శత్రువు తనచేత
చిక్కెనేని కీడు చేయరాదు
పొసగమేలు చేసి పొమ్మనుటయే చాలు-



మిరపుగింజ చూడ మీద నల్లగనుండు
కొరికిచూడ లోన చురుకు మనును
సజ్జనులగువారి సారమిట్లుండును-

నీళ్ళలోన మొసలి నిగిడి ఏనుగుబట్టు
బయట కుక్కచేత భంగపడును.
స్థానబలము కాని తనబలము కాదయా-

అనువుకానిచోట అధికులమనరాదు
కొంచెముండుటెల్ల కొదువకాదు
విత్తనంబు మర్రి వృక్షంబునకు నెంత?-

గంగిగోవుపాలు గరిటెడైనను చాలు
కడివెడైన నేమి ఖరముపాలు
భక్తి కలుగు కూడు పట్టెడైనను చాలు-

ఓగునోగుమెచ్చు నొనరంగ నజ్ఞాని
భావమిచ్చి మెచ్చు పరమలుబ్ధు
పంది బురదమెచ్చు పన్నీరు మెచ్చునా-

అంతరంగమందు నపరాధములు జేసి
మంచివాని వలెను మనుజుడుండు
ఇతరులెరుగకున్న ఈశ్వరుడెరుగడా-

ధనము కూడబెట్టి దానంబు చేయక
తాను తినక లెస్సదాచుగాక

తేనెటీగ గూర్చి తెరువరి కీయదా-

ఇచ్చువాని యొద్ద నీనివాడుండిన
చచ్చుగాని ఈవి సాగనీడు
కల్పతరువుక్రింద గచ్చపొద యున్నట్లు—

కడుపుకేల నరులు కళకళ పడెదరు
కడుపు చల్లబడగ కలదు భుక్తి
కడకు రాతిలోని కప్పకు లేదొకో—

నేరనన్నవాడు నెరజాణ మహిలోన
నేర్తునన్నవాడు వార్త కాడు
ఊరకుండు వాడె ఉత్తమోత్తముండు—

ఉప్పులేనికూర ఒప్పదు రుచులకు
పప్పులేని తిండి ఫలములేదు
అప్పులేనివాడె అధిక సంపన్నుడు—

తామసింపజేయ తగదెట్టి కార్యంబు
వేగిరింప నదియు విషమమగును
పచ్చికాయదెచ్చి పడవేయ ఫలమౌనె—

చాకి కోకలుతికి చీకాకు పడజేసి
మైలదీసి లెస్స మడచినట్లు
బుద్ధి చెప్పువాడు గుద్దితే నేమయా—

అన్ని దానములకు అన్నదానము మిన్న
కన్నవారికంటె ఘనులులేరు
ఎన్న గురునకంటె ఎక్కువలేదయా
విశ్వదాభిరామ వినురవేమ.

ఆంధ్రదేశం తెలుగు కవిత నిలిచి వున్నంతకాలం వేమన కవిత నిలిచి వుంటుంది. వారి పద్యాలు ఆణిముత్యాలు—అక్షర సత్యాలు. అందులో ఏ కొద్ది మొత్తమో కాలదోషం పట్టిన భావాలు వుండవచ్చును. కాని మహోప్రాతిక మువ్వీసం చెన్ను తరగనివి, వాసి చెడనివి, వాడి పీడనివి. అందులో అర్ధాంశమైనా ఆచరణ లోకి తెస్తేనే మనం ఆంధ్రులం—లేకుంటే? అంధులం—అని వేరే అనాలా! అచ్చమైన ప్రగతిశీల సజీవ కవితా చైతన్యమూర్తి వేమన.

ఆ ప్రజాకవి కీర్తి అజరామరం!

